శ్రీ ౪౦౮ 213

# సీమంతినీ నాటకము.

ఇది

బళ్లారిజిల్లా బళ్లారిడిస్ట్రిక్టు మునసఫ్‌కోర్టువకీలు
కోలాచలం శ్రీనివాసరావుచే
రచియింపంబడినది.




మద్రాసు

ఆనందముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1899.



[తపాలా ఖర్చు 0—1—0.

-12—0.]

# పీఠిక.

## కథాసంగ్రహము.

పూర్వంబున నార్యావర్తమను పుణ్యదేశంబు నేలుచు నఖిల నిశ్చలధర్మశీలుండును దుష్టాత్మదమనుండును శిష్టావనుండును బహువిధాధ్వరోద్యోగనిత్యప్రయత్నుండును శివవిష్ణుభక్తియుక్తుండును నై చిత్రవర్మయను చక్రవర్తి యొకఁడుండెను. ఆమహారాజొక కన్యకాలలామంబుం గాంచి సీమంతినియనునామంబిడి పరమానందుండై జాతకలక్షణజ్ఞులను బిలిపించి కన్యాజననకాలఫలంబడిగిన నందొకవిప్రముఖ్యుం డాకన్య దశసహస్రవర్షంబులు భర్తతోఁగూడఁ బుత్రసంపత్తిఁ బొదలి సకలసామ్రాజ్యభోగంబు లనుభవించునని పలికెను. మఱియొక ధాత్రీసురుండు శంకాకళంకరహితుండై భవత్కన్యకారత్నంబునకుఁ చతుర్దశవర్షాంతంబున వైధవ్యప్రాప్తి యని వచించెను వజ్రనిర్ఘాతనిష్ఠురంబగు తద్వచనంబు వీనులంబడినంతన రాజుగుండె ఝల్లుమన మూర్ఛాగతుండై యెట్టకేలకుం దేఱి రానుండిన యాపదలు పోనేర్చునే యని విగతఖేదమానసుండయ్యెను. కతిపయకాలానంతరంబున యాజ్ఞవల్క్యయను మునివరుభార్య మైత్రేయి యారాజుయొక్క శుద్ధాంతంబున మాటలాడుచుండ రాజకన్య సీమంతిని యామైత్రేయికిం మ్రొక్కి సఖులచేఁ దా వినిన యుదంతంబెఱిఁగించి తనకుం గలిగెడు వైధవ్యప్రాప్తికి దుఃఖింప నామైత్రేయి సోమవారవ్రతంబనుష్ఠింపుమని తదాచరణవిధంబుఁ దెలిపి యరిగెను. సీమంతిని తద్వ్రతంబు నియతినిఁ జేయుచుండెను. సీమంతినిన్నుచితవయస్సు ప్రాప్తింపఁ జిత్రవర్మ తన సఖుఁడయిన యింద్రసేనపుత్రునకుఁ జంద్రాంగదున కాసుతనిచ్చి యుద్వాహంబొనరించెను.

మాత కొన్ని నెలలు శ్వశురగృహంబున నిలిచి యొకదినంబున సఖులం గూడి యమునానదిలో నావపై విహరించుచుండ నావ మునిఁగెను. ఇవ్వార్త సీమంతినీసతి విని దుఃఖించుచు సకలభోగములు వదలి యుమామహేశ్వరాలయముంజేరి యచటనే మైత్రేయీబోధితంబయిన సోమవారవ్రతంబు వదలక యొనరించుచుండెను. చంద్రాంగదుని తలిదండ్రులు దుఃఖమున రాజ్యపరిపాలన యుపేక్షించి యుండ శత్రురాజులు వారిఁ బట్టి చెఱఁబెట్టి రాజ్యంబపహరించిరి. అచ్చట యమునాహ్రదంబున మునింగిన చంద్రాంగదుఁడు దలక్రిందై పాతాళలోకంబునకుం బోవుచుండ నచ్చట విహరించుచున్న నాగకన్యకలు వానింజూచి రక్షించి తక్షకస్వామి సన్నిధానంబునకుఁ గొనితెచ్చిన నహికులేంద్రుండు వానింగని నీవెవ్వడవని యడుగం జంద్రాంగదుండు దన కులగోత్రాహ్వయంబులు దెలిపెనంతట గుండలీంద్రుండు నీవు పూజించు దైవంబెయ్యది యని ప్రశ్నింపఁ జంద్రాంగదుం డీశ్వరుననేకవిధములఁబొగడి యతఁడే తనకు దైవంబని యుత్తరం బిచ్చెను. బాల్యంబున నింతటి శైవతత్త్వవేత్తయగుటకుఁ దక్షకుండాశ్చర్యమొంది కరుణించి దివ్యాభరణాద్యలంకృతులం గై సేసి సాహాయ్యముగా నొక నాగకుమారునిచ్చి భువికిం బంపెను.చంద్రాంగదుండువసుధం జేరియమునాతీరోపాంతమం దొక వనంబున సంచరించుచుండెను. సీమంతిని సోమవారవ్రత మాచరించుటకై దైవపూజానకుఁ బుష్పంబులు దెచ్చుటకైయావనంబునందుండెను. బంగరుకమ్మలు గాజులు మంగళసూత్రంబు గుంకుమయుఁ గాటుకయుఁ ముంగర రవికెయు మొదలగు శృంగారముకలిమి లేని చిగురుంబోడిని చంద్రాంగదుఁడు చూచి తనదారయగునో కాదో యని సంశయించి నీవెవ్వతవెందు కివ్వనంబున సంచరింతువని యడుగ సీమంతిని తనవృత్తాంతంబు దానై తెలుపుటకుఁ లజ్జించుచుండ తత్సఖిమణి యారమణి యుదంతం బంతయు విన్నవించెను. చంద్రాంగదుఁడు దుఃఖించి

తాను చంద్రాంగదుని పాణిపదంబనుచు నతఁడు జీవితుఁడుగా నున్నాఁడనియును యింతలో వచ్చుననియును జెప్పి తన దేశమునకుఁ బోయెను. అచ్చట శత్రురాజు చంద్రాంగదునిరాక విని నంతన రాజ్య మిందురసేనున కిచ్చెను. పిదప నిందురసేనుం డివ్వార్త చిత్రవర్మునకుం దెలిపి సీమంతినికినిఁ జంద్రాంగదునకును విధ్యుక్తముగాఁ బునరుద్వాహం బొనర్చెను. సీమంతిని యుమామహేశ్వరుల పూజ యెడ తెగక జరుపుచుండెను. విదర్భ దేశమునందు వేదమిత్రుఁడు సారస్వతుఁ డనెడి యిరువురు ద్విజులుండిరి వేదమిత్రుని కొమారుఁడు సుమేధుఁడు. సారస్వతునికొడుకు సామవతుఁడు (సోమవతుఁడనికొన్ని ప్రతులలోనున్న యది). సుమేధసామవతులు సమాన వయస్కులు సమానపండితులు బ్రహ్మచారులు పేదవారు వీరికిఁబెండ్లి సేయఁ దలంచి వీరితలిదండ్రులు విత్తమార్జించికొని వచ్చుటకై విదర్భ రాజువద్దకుం బొండని యీసుతులకు నానతిచ్చిరి వారాయానతిరీతి విద ర్భరాజు సరసకుం జని తమవిద్యలచే నారాజును మెప్పించి ధనార్థులమై వచ్చితిమని యెఱింగింప రాజు కుటిలవిచారుండై సీమంతినియనుసతి సోమ వారవ్రత మాచరించుచున్నదనియు వ్రతదినంబున భూసురదంపతులకు భూరిదక్షిణలొసంగుచున్నదనియును దెలిపి మీయిరువురిలో నొకరు స్త్రీరూపంబుఁ దాల్చి దంపతులుగాఁ బోయి సీమంతినిచే నర్థంబుఁ బడసి రండని సెలవిచ్చెను ద్విజకుమారులు వెఱగంది యిట్టికృత్రిమంబు బ్రాహ్మణులకుఁ జెల్లదని యెంత తెలిపినను రాజు వినక యాకుమారులను నిర్బంధపెట్టి సామవతునకు భామావేషంబు వేయించి దంపతులుగా వారిని సీమంతిని వద్దకుం బంపెను. సీమంతిని వారి మాయోపాయం బెఱింగియు, వారినిఁ బార్వతీపరమేశ్వరులుగాఁ బూజించి వారికిఁ బుష్కల ధనంబిచ్చిపంపెను. సీమంతినీప్రభావంబుచే నిజముగుస్త్రీగామాఱిన సామ వతి సూనశరాస్త్రప్రహతికి నోపక మార్గమున సుమేధుని కామక్రీడకు

రమ్మని నిర్బంధించెను. సుమేధుఁ డారూపంబుఁ జూచి యది సీమంతినీ మహిమ యని యెఱింగి సామవతిని సాంత్వనవచనంబుల నూఱడించి పురిఁ జేరి జరిగిన వృత్తాంతంబంతయు సారస్వతునకుం దెలిపెను. సారస్వతుండు రాజుసేసిన యపచారంబునకుఁ గినిసి రాజువద్దకుం బోయి పరుషోక్తులచే నతని దూషింప నతఁడు భయమంది తనకులగురువగు భరద్వాజుని రప్పించి తనదోషంబంతయు నెఱింగించెను. భరద్వాజుండేమియుదోఁపక భవానినిం బూజింపవలెనని తెలిపి దేవీయుపాసనకుం బ్రారంభింపఁజేసెను. పార్వతి ప్రత్యక్షమై సామవతికి మరల బురుషత్వము రాదనియును సుమేధునకు సామవతినిచ్చి పెండ్లిసేయవలెననియును సారస్వతునకు నొక కొమారుఁడు గలుగుననియును దెలిపెను. అందఱు సంతసించి సామవతీసుమేధులకు నుద్వాహం బొనర్చిరి. ఇదియే సంస్కృతబ్రహ్మోత్తరఖండమను పురాణంబునందలి యితివృత్తము. దీనినిఁ బ్రారంభమున శ్రీధరమల్లె-వెంకటరామకవి యాంధ్రీకరించెను. ఇది ముద్రింపంబడినది. పోతరాజు పుల్లన్నయను కవియొకఁడిటీవల బ్రహ్మోత్తరఖండమును నాంధ్రీకరించెను. ఇది యముద్రితముగా నున్నయది. వేంకటరామకవికవిత్వము ప్రౌఢముగా నున్నయది. పైఁడిమఱ్ఱి వేంకటపతియనుమహాకవి చంద్రాంగదచరిత్రయని నామంబిడి యొక ప్రౌఢప్రబంధం బాంధ్రంబున రచించినాఁడు. అందు సీమంతినీచంద్రాంగదులకు వివాహమొకటి పురాణస్థముగా నున్నది. మిగతభాగమంతయుఁ గేవల ముత్పాద్యము. ప్రబంధసరణి ననుసరించియున్నయది. ఈనాటకమునందలి యితివృత్తము పురాణోక్తముగా నున్నను గొంత యుత్పాద్యముసైతముఁ జేర్పఁబడినది. ద్విజుఁడు దపం బొనరించినది యుత్పాద్యము. చంద్రాంగదచరిత్రనుండి గ్రహింపంబడినది. మిగతకథసైతము మించుక మార్పఁబడినది. సీమంతినీసతీమహిమ యీనాటకంబున వ్రాసితిఁ గావున దీనినామంబు సీమంతినీనాటక మని

పెద్దిడిత్తి. ఈనాటకంబుఁ బ్రదర్శింప 6-ఘంటలకాలము పట్టును. అంతకంటెను దక్కువకాలములో ప్రదర్శింపఁ బూనువారు పంచమాంకాంతంబునుండు సీమంతినీవివాహంబువఱకుఁ బ్రదర్శించి మిగతభాగంబు వదలనగు. ఇంకను హెచ్చుకాలము ప్రదర్శింప నిచ్ఛయించువా రచటనచటఁ గొన్నిగీతములు చేర్పవచ్చును. గుంటూరులో నుండెడి యగ్రహారపు నాటకకంపినీవారు సునందినీపరిణయము $9\frac{1}{2}$ ఘంటకుఁ బ్రారంభించి 5 ఘంటకు (అనగా $7\frac{1}{2}$ ఘంటలకాలము) ముగించితిమనిన్ని, సుఖమంజరీ మదాలసానాటకములు చిన్నవిగా నున్నయవి వానికిఁజేరికగా నొకవినోదకథ (farce) ప్రదర్శింతుమనిన్ని వ్రాసిరి. చెన్నపట్టణమువారు $12\frac{1}{2}$-1 ఘంటలోఁగా ముగియు నంత నాటకము ప్రదర్శింపనగును గాని హెచ్చుగా నుండిన వదలవలసివచ్చు ననుచున్నారు. ఈనాటకంబుఁ బ్రదర్శింపఁ బూనువారు కాలానుకూలమెటులుండునో యటుసేయనగు. ఇంతకుఁ హెచ్చు కావలెననువారు తమయిష్టానుసారంబుగఁ బాటలుజేర్పవచ్చును.

1899 వ సంవత్సరము
జూన్ నెల 27-వ తేదీ.
బళ్లారి.

ఇటనివిన్నవించు
కోలాచలం - శ్రీనివాసరావు.



## ఈనాటకమునందలి ముఖ్యపాత్రలు - తత్ప్రవేశస్థలములు.

# పురుషులు.

చిత్రవర్మ్మఁడు.—ఆర్యావర్తదేశపురాజు. ప్రవేశము. అంకము I. రంగము I. అంకము III. రంగము III. అంకము IV. రంగము II. అంకము IV. రంగము V. అంకము V. రంగము I.

సుమతి.—చిత్రవర్మనిమంత్రి. ప్ర॥ అంకము I. రంగము I. అంకము IV. రంగము V.

నారాయణభట్టారకుఁడు.—దైవజ్ఞుఁడు. అంకము I. రంగము I. అంకము IV. రంగము V.

ఈశ్వరభట్టు.—దైవజ్ఞుఁడు. అంకము I. రంగము I. II. అంకము II. రంగము III అంకము IV. రంగము V.

మాధవభట్టు.—నారాయణభట్టారకుని శిష్యుఁడు. అంకము I. రంగము I.

జోగయ్య or రామాభట్టు.—ఈశ్వరభట్టు శిష్యుఁడు, ,,

భృంగీశ్వరుఁడు.—అంకము II. రంగము I. II.

చంద్రాంగదుఁడు.—ఇంద్రసేనునిసుతుఁడు. అంకము III. రంగము I. II. V. అంకము IV. రంగము I. III. IV. అంకము V. రంగము I.

ఇంద్రసేనుఁడు.—నిషధరాజు. అంకము V. రంగము I.

యుగంధరుఁడు.—చంద్రాంగదుని సఖుఁడు. అంకము III. రంగము I. II. V. అంకము IV. రంగము I.

సాంబశాస్త్రి, నారాయణవధానులు, సుబ్బాజోస్యులు, పడిగంభట్లు. } చంద్రాగదుని పెండ్లికిఁబోయిన ద్విజులు, అంకము III. రంగము IV.

వీరసేనుఁడు.—చిత్రవర్మనికొమారుఁడు. అంకము III. రంగము V.

తక్షకుఁడు.—రసాతలమునేలు నాగరాజు, అంకము IV. రంగము III.

సత్యవంతుఁడు.—నాగకొమారుఁడు. అంకము IV. రంగము IV.

చంద్రహాసుఁడు.—విదర్భరాజు. అంకము VI. రంగము I. అంకము VIII. రంగము I. II. III.

సుమేధుఁడు.—వేదమిత్రునికొడుకు. అంకము VI. రంగము I. అంకము VII. రంగము I. II. III. అంకము VIII. రంగము III.

సామవతుఁడు,—సారస్వతునికొడుకు. అంకము VI. రంగము I.

మతిగుప్తుఁడు.—చంద్రహాసునిమంత్రి. అంకము VI. రంగము I. అంకము VIII రంగము I. III. IV.

సారస్వతుఁడు.—సామవతితండ్రి. అంకము VIII. రంగము I. II. III.

వేదమిత్రుఁడు.—సుమేధునితండ్రి. అంకము VIII. రంగము III.

భరద్వాజులు—ఋషి. అంకము VIII. రంగము III.

వ్యాసశాస్త్రి.—రాజపురోహితుఁడు. అంకము VIII. రంగము IV.

పరమేశ్వరుఁడు,—ద్వితీయాంకము. తృతీయరంగము.

పైపాత్రలుఁగాక పరిణయంబునకుంజేరిన ద్విజులనేకులు ప్రవేశింతురు.

## స్త్రీలు.

రంభ.—
ఊర్వశి.— } అప్సరసలు. అంకము II. రంగము II. III.

మైత్రేయి.—యాజ్ఞవల్క్యభార్య. అంకము II. రంగము IV.

యోగిని.—మైత్రేయి శిష్యురాలు. ,, ,, అంకము IV. రంగము IV.

సీమంతిని.—చిత్రవర్మనిసుత. చంద్రాంగదునిభార్య, అంకము II. రంగము IV. అంకము III. రంగము II. అంకము IV. రంగము II. IV. అంకము. V. రంగము I. అంకము. VII, రంగము. II.

సుశీల,—
విమల.—
కలవాణి.— } సీమంతినీసఖులు. అంకము III. రంగము II. అంకము VII. రంగము. II.

చిత్రరేఖ.—చిత్రవర్మనిభార్య. అంకము III. రంగము III.

కళావతి.—చిత్రరేఖదాసి. ,, ,,

సామవతి.—సామవతుని స్త్రీరూపము, అంకము. VII. రంగము. I. II. III. అంకము. VIII. రంగము. I. III.

పార్వతమ్మ.—
శేషమ్మ.—
నర్సమ్మ.—
} వీరున్న మతికొందఱు బెండ్లిము త్తైదువలుగా వచ్చియుందుర్రు.

పార్వతీదేవి.—అష్టమాంకము, ద్వితీయరంగము, ద్వితీయాంకము. తృతీయరంగమ

# తప్పొప్పుల పట్టిక.

తప్పులొప్పులపట్టిక - తనరఁగూర్చి
వ్రాసినాఁడనుమీరిది - వాసిగఁగని
చదువుడీకృతిమఱికొన్ని - కొదవలున్న
నగుపఱచినాదువినతుల - నందుఁడీరు.

| పుట. | పద్యము. | పజ్త్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 4 | 12 | 13 | జాతఫలమధురిమంబు | జాతఫలముమధురిమం |
| 5 | 15 | 11 | ఫలంబిపుడిచ్చెఁ | ఫలమిపుడిడెఁ. |
| 8 | ,, | 1 | మాధవునితో | మాధవునితో. |
| 19 | 37 | 3 | లెట్టి వేనిఁ | లెట్టి వేని. |
| 20 | 38 | 11 | వరమిమ్ము | వరమ్మిమ్ము. |
| 62 | ,, | 4 | సామవంతుఁడు | సామవతి. |
| 71 | 114 | 6 | నింత. యడియావడి | నింతయడి. యావడి. |
| 72 | ,, | 24 | చంద్ర. | చంద్రహాసా! |



శ్రీరామాయనమః.

# దేవతాప్రార్థన.

ఉ. శ్రీ వెలయం ద్రివిక్రిముని ♦ చిత్తమున న్నివసించు లక్ష్మి లో
కావలిఁ జూడఁగా నిడిన ♦ యచ్చపుటద్దమొ, సర్వలోకశో
భావహభవ్యరూపములఁ ♦ బట్టుటకుంచినదర్పణమ్మొ, మా
శ్రీవరుకౌస్తుభం బిడుత ♦ శ్రీయుఁ జిరాయువు నాశ్రితాళికిన్. 1

క. శరధిజ మది నేఁ దలఁచెద,
శరణాగతజనవిపద్ద ♦ శాతిమిరహర
త్కరుణావలోకచంద్రిక,
హరి వక్షస్స్ఫురిత మాత ♦ నతివిఖ్యాతన్. 2

క. త్రిజగద్వంద్యపదాబ్జున్,
భజకామరభూజసదృశు ♦ భాస్వర తేజున్
వృజనవ్రజపరిహర్తన్,
భజియింతున్ భువనకర్త ♦ భాషాభర్తన్. 3

క. సులలితవీణాపాణిన్,
విలసద్వీక్షాజితైణి ♦ విపులశ్రోణిన్
జలరుహసంభవురాణిన్,
బలరిపుమణినీలవేణి♦వాణి భజింతున్. 4

క. శతమఖముఖసురతతిసం,
స్తుతునిన్ భజియింతుసోమ ♦ సూర్యాగ్నిదృగం
చితు ధనపతిపరమహితున్,
కృతకకిరాతీసురూప ♦ గిరిజాకాంతున్. 5

క. పర్వశశివదన, సేవక
సర్వాభీష్టప్రదాత్రి ♦ శాత్రవహంత్రీ
గీర్వాణీనుతచరిత్రీ,
పార్వతి నే మదిఁ దలంతు ♦ భక్తి దలిర్పన్. 6

క. వృజనహరు నేకదంతున్,
రజనీకరనిటిలు నంత ♦ రాయకృతాంతున్
అజముఖమఖభుక్పూజితు,
భజియింతున్ శాంతిమంతు ♦ భవ్యస్వాంతున్. 7

తే. సత్కృతుల దేవభాషఁజ ♦ మత్కృతముగ,
రచన మొనరించి సత్కీర్తి ♦ రాజిఁగన్న
కవులఁ బ్రాచేతసవ్యాసకాళిదాస,
దండిభవభూతిముఖ్యులఁ ♦ దలఁతు భక్తి. 8

తే. ఆంధ్రకవితావధూటిని ♦ నాది నెవఁడు,
సృష్టి గావించె దాని వి ♦ శిష్టవిధుల
వృద్ధి నొందించె నెవఁ డట్టి ♦ విమలయశుల,
నన్నయను దిక్కయజ్వను ♦ సన్నుతింతు. 9



శ్రీరస్తు.

# సీమంతినీ నాటకము.

## ప్రథమాంకము.

### ప్రస్తావన.

సూత్ర. నాందీపద్యము.

ఉ. శ్రీవెలయం గనుంగొనఁగ • సీతను రాముఁడు, రాము సీతయున్,
భావమునందుఁ దోఁచెఁ గను • వారల కద్భుత మైనరీతి పుం
స్త్రీవిభవవ్యతిక్రమము • శ్రీతరళంబులఁ, దత్సుబింబముల్
భావుకమున్ ఘటించుతను • బాగుగ మీకు సదా ముదాప్తిగన్. 10

(నాంద్యంతంబున సూత్రధారుఁడు).

మ॥క్కో॥ వేదశాస్త్రపురాణవేత్తలు • వేదమౌళివిహారులున్
సాదరాయతచిత్తులై యిటు • లాదరింప సతూర్యస
మ్మోదనాదము మేళవింప న • మోఘ మీదిన మంచు నే
మేదుర మ్మగుభక్తి సభ్యుల • మీఁదు మిక్కిలివేఁడెదన్. 11

(అనుచుఁ బుష్పంబులు వెదచల్లి సమస్కరించి) శుభకాలం బాసన్నం బయ్యె. నటి రా దయ్యె. జడజాతులు జడమతులుగదా.

(నటి ప్రవేశించి)

నటి. ఆర్యపుత్రా - వచ్చితి.

సూత్ర. ఆర్యా, నీకు వేయేండ్లాయువు.

నటి. మాటలం దతిశయోక్తి యేల? మానవులకు నాయువు నూఱేండ్లు గదా!

సూత్ర. ఆర్యా, తెలియనిదానివలె వచించెదవు. సీమంతిని యనుభామామణి సీమంతినియుంబలె దశసహస్రవర్షంబులు వర్ధిల్లి సౌభాగ్యమున మని యుండదా?

నటి. నిజము నిజము ; జ్ఞప్తికి వచ్చెను; బ్రహ్మోత్తరఖండపురాణకథ గదా: శ్రేయస్కర మగుకథ యది; నాటకంబుగా నుండినఁ బ్రదర్శింప వచ్చుచుండెను.

సూత్ర. ఆర్యా, అది ప్రదర్శింపం జేయుటకుఁగదా నిను దలఁచితి.

నటి. ఆర్యపుత్రా, నేల విడిచి సాముసేయ యత్నించువారలంబలె నాటకము లేక దానిం బ్రదర్శించుప్రయత్నంబుఁ బూనెదవా?

సూత్ర. ఆర్యా, నాటకము లే దన నేల? నూతననాటకం బొకటి యున్నది.

నటి. ఏమీ! ఎవరు చేసిరి?

సూత్ర. ఆర్యా, ఆధునికకవు లొకరు రచియించిరి.

నటి. సరి సరి, అటు లయిన రసం బుండదు.

క. నూతనకవికావ్యములం,
దాతతరసపుష్టి యుంట•యమరు నెటు లహో
ఖ్యాతికల దై నవేమునఁ,
జాతఫలమధురిమంబు • చొప్పడుటగదా. 12

సూత్ర. ఆర్యా వేమునకు సామ్యం బిడుట తప్పు; రసాలం బని చెప్పుట యొప్పు. కారణం బేమన్ననో యాధునికకవులు పురాతననాటకంబులు శోధించి, స్వారస్యము గ్రహించి స్వానుభవముచే మించి నాటకంబులు రచియింతురు. కాలానుగుణంబుగఁ గొన్ని పూర్వాచారములను త్యజించినను నది యొకసుగుణముగా నేమనము గ్రహింపనగును.

నటి. ఆర్యపుత్రా: ఈనూతననాటకం బందఱు మెచ్చఁదగినదిగా నున్నదా?

సూత్ర. అటు రచింప నలువ కయిన నలవి గాదు. "లోకో భిన్నరుచి" యని యున్నది గదా. ఒకరికి రుచించినది మఱియొకరికి రుచింపదు.

తే. మృదుమధురవాక్యసరణిని • మెచ్చ రకట
తర్కవాదకఠోరతఁ • దనరువారు
కారమును దిని నాలుక • కాయ గాచి
నట్టివారికి నిం పగు • నెట్టు తీపు. 13

నటి. ఆర్యపుత్రా: నిజము పల్కితిరి. అయిన నీనాటకపదరచన మృదు వయినదా? కఠిన మైనదా?

సూత్రి. చ. కలుఁగుఁగదా మృదుత్వమును♦గర్కశము న్విషయాదిభిన్నతం
గలుగునె వాని కెప్పటికిఁ ♦ గాని, విరోధము, స్త్రీకటాక్షముల్
వలచినవారికే నమృత♦వాహిను లై సుఖ మిచ్చు నన్యునిం
దలఁకఁగఁ జేయు హాలహల♦ధారలుగాఁ గృతి యట్టిదే గదా.

నటి. ఆర్యపుత్రా; ఈనాటకకర్త లెవరు.

సూత్ర. (రత్నావళి)

అమరసునందని సుఖమంజరియు మ ♦ దాలసయు ననెడినాటకముల్
సుతుముఖ్యములుగ సుముఖుల కొసఁగెను ♦ సుకృతి యెతఁ డతఁడె
సుధి వసుధా

సుమనోమణి కోలాచలవంశజ ♦ సుందరమణి, శ్రీనివాస రా
వమరనుతము సీమంతినినాటక♦ మనునీయమృతఫలంబిపుడిచ్చెన్.

నటి. ఆర్యపుత్రా: అటు లయిన నీనాటకప్రదర్శన మవశ్యకర్తవ్యంబు. అయిన నొక సందేహంబు మనంబున బాధించు చున్నది.

సూత్ర. ఆర్యా, అదియేమి ?

నటి. ఆర్యపుత్రా, ఈగ్రంథకర్తగారు జీవితులుగదా.

సూత్రి. బళ్లారిపట్టణమందు న్యాయవాదులుగా సుఖమున నున్నారు.

నటి. అటు లయినఁ బ్రయోగానర్హ మయిననాటకం బిది.

సూత్ర. కారణం బేమి? జీవితుండుగా నుంట దోషమా ?

నటి. గొప్పదోషము. కావ్యదోష మని చెప్ప నొప్పు.

ఉ. పండితు లైనవారు బహు ♦ భంగుల వాక్యపదస్థదోషముల్
మెండుగ మున్నె తెల్పి రవి ♦ మేదిని నిల్చెను శాశ్వతంబుగా
నుండు మఱొక్కదోష మది ♦ యూహకు మీఱెను, గావ్యకర్తదా
నుండుట భూరిదోష మది ♦ యోజనసేసిన వారియ కుందురే. 16

సూత్ర. ఆర్యా, నీయర్థంబు దెల్లం బయ్యె. కవి బ్రతికియుండిన, నసూయాపరులు వ్యర్థముగా దోషము లన్వేషించు చుందు రనికదా. అట్టితటి గ్రంథకర్త బ్రతికి యుంట యెంతటిసుగుణమో కనవా?

చ. కవి దివి కేఁగఁ దత్కృతిని ♦ గాంచినవా రొగి నర్థభావముల్
వివిధముగా గ్రహించుచుని ♦ వే కవి వంచుఁ దలంచు చుంద్రు; త
త్కవి మని యున్న నిశ్చయముఁ ♦ గానఁగ నోఁగద, వానిచేతనే
కవి భువి నుంట తత్కృతికిఁ ♦ గాంచినవారికిఁ జాల మే లగున్. 17

నటి. ఆర్యపుత్రా, యథార్థము వచించితిరి. ఇఁకఁ గర్తవ్యకార్యంబున నను నియోగింపుఁడు;

సూత్ర. ఆర్యా, సర్వర్తుప్రాముఖ్యం బయినయీవసంతర్తువు నీచే వర్ణనీయంబుగదా.

నటి. శుభము. నిశ్చేతనులకు సైతము చేతన్యకారి యగునుగదా వసంతము. కంటివే యీరసాలగుచ్ఛంబు.

ఉ. మంజులగుంజముల్నె అపు♦మత్తమధువ్రతబృంద మంటఁదా
నంజి చలించు, మందమల♦యానిలసంగతిఁ దూఁగి క్రాఁగి డాఁ
గం జను, మాకరందమిషఁ ♦ గార్చును నశ్రువు లౌర కామిగా
రంజిలుచూతగుచ్ఛ మదె♦రమ్యవసంతదినోదయంబునన్. 18

సూత్ర. ఆర్యా, ఎంతయాహ్లాదకరంబుగా నున్నది యీవర్ణన. ఔనౌను. ఎంతటిమహిమాస్పదంబు లీమధువాసరంబులు. మత్తమధువ్రతములపాలిటినిత్యోత్సవంబులుఁ గనుమా యీభృంగీభృంగములసంతసంబు.

ఉ. మావులపుష్పరేణువుల♦ మానగుపాదులయంతరంబులం
దావిఁ జెలంగుసూనరస♦ధార సుమప్లవ మెక్కి హాయిగా
భావభవస్తవంబులను♦బాడుచు భృంగము కాంతఁ జేరుచున్
మోవిని నున్న తేనియను♦ముద్దులఁ బీల్చుచు సంతసిల్లెడున్. 19

ఆర్యా, ఋతువర్ణనాతిశయోత్సవంబున నియుక్తముహూర్తకాలంబు మఱచెదవుసుమా.

నటి. ఆర్యపుత్రా, నాటకప్రదర్శనంబునకు ముహూర్తసాధన యేల?

సూత్రి. ఆర్యా, అన్నికార్యంబులకును శుభకాలమే సర్వశ్రేయము; (తెరవైపుఁ జూపి) ఇటు చూడుము. చిత్రవర్మమహారాజాస్థానమండపమున దైవజ్ఞులం జేర్చి తనసుతజననముహూర్తఫలంబు విమర్శింపఁడా?

నటి. ఆహా! ఔనౌను, ఎంతటిదైవికం బిది. మనము వైళంబ నేపథ్యముం జేరి నాటకోచితకార్యంబు సాధింతము.

సూత్రి. ఆర్యా, రమ్ము. (నిష్క్రమింతురు.)

(అని ప్రస్తావన.)



## ప్రథమరంగము-ఆస్థానమండపము.

---

రాజు చిత్రవర్మ; మంత్రి సుమతి; దైవజ్ఞులు, నారాయణభట్టారకుఁడు. మాధవభట్టొకవైపునను, ఈశ్వరభట్టు, నతని శిష్యుఁడు జోగయ్య యొకవైపునను మఱి కొందఱును గూర్చునియుందురు.

చిత్రవర్మఁడు (లేచి.)

ఉ. ఆతతసర్వశాస్త్రసక • లాగమధర్మవిధిజ్ఞులార, యో
జాతకలక్షణైకసువిచారవి • శారదులార, యుత్తమ
క్ష్మాతలదేవులార, చిర • కాంక్షిత మైనసుతోదయంబు వి
ఖ్యాతిని నీతఱిం గలిగె • నారయుఁ డీసుతజాతకంబునున్. 20

(అనుచు జన్మపత్రిక యిచ్చును.)

(ద్విజు లందఱు జన్మపత్రికను జూచుచు ప్రవేల్లెంచుచుందురు, నారాయణభట్టారకుఁడు మాధవభట్టుఁ బిలిచికొని దూరం బేఁగి గుసగుసలాడును.)

ఈశ్వర. దైవజ్ఞులారా, ఎంత సలక్షణముగా నున్నది, కంటిరే యీజన్మకుండలిని?

రామ. ఆహా! సౌభాగ్యమా; పుత్రస్థానాధిపతియును, గుటుంబస్థానాధిపతియును రాజ్యస్థానమం దున్నవారు.

ఈశ్వ. పైఁగా వారు భర్తృస్థానాధిపతిని మైత్రిం జూచుచున్నవారు.

{ దూరంబున నారాయణభట్టారకుఁడు మాధవభట్టుతో
విముఖభవాజాతకమును విముఖవిపశ్చిత్తులు వీక్షించుచున్నవారు }

రామ. ఈశ్వరభట్టుగారూ, ఇన్నిశుభగ్రహములు సలక్షణస్థానమం దున్నవు డీసుత చక్రవర్తిని యగుటకును బుత్రవతి యగుటకును సందియం బేమి?

(నారాయణుఁడుమాధవునితో) మాంగల్యమే సందేహము. "గ్రామో నాస్తి శతస్త్రీమా" యనినటుల విధవకుఁ బుత్రి లఁట.

ఈశ్వర. ఏసందియంబును లేదు. ఇది సిద్ధాంతమే.

రామ. అయినను నారాయణభట్టారకునితో నించుక యాలోచించుట మేలు గదా, నూతనపండితుఁ డతఁడు. గ్రంథము జ్ఞప్తిలో నున్నయది.

ఈశ్వ. (మాధవువైపునకుంబోయి). ఆగరుడున కేమి తెలియును. నోరు మూసికొనిసఁదల వాఁగుచుండును. వాయి తెఱచినం, బెడసరపుఁబలుకులే గదా. ఇంతకు నేను, బూర్వం బనిన, వాఁడు పశ్చిమం బని నాతో వాదించును.

(అనుచు లేచి రాజున కభిముఖుఁడై)

చిత్రవర్మమహాప్రభూ, నీకన్య సకలలోకమాన్య యై పుత్రపౌత్రాభివృద్ధిచే దశసహస్రవర్షంబులు చక్రవర్తినిగా సకలసౌభాగ్యసంపద్యుత యై మని యుండును.

చిత్ర. ద్విజవరులారా, ముద మందితి. నాజన్మంబు సార్థకం బయ్యె.

(సుమతిదిక్కుఁజూచి)

సుమతీ; ఈభూసురోత్తములకు భూరిద్రవిణం బొసంగుము.

సుమతి. మహాప్రభూ, చిత్తము, దేవరయాజ్ఞ.

నారా. (నారాయణభట్టారకుఁడు సమీపించి కను లెఱ్ఱఁజేసికొని యీశ్వరుభట్టు మొగముం గని).

ఓరీ: సమస్తజ్యోతిశ్శాస్త్రరహస్యసంవేది యై నే నుండ, సగ్రహారంబునఁ దమ్మశజోస్య మనుభంగి నీవా రాజసుతజాతకఫలంబు నుడువువాఁడవు ?

ఈశ్వర. (కినిసి తల యూఁచి) ఔరా! ఎంతటిగర్వము. హనుమంతునిముందు కుప్పిగంతులా? చాలుఁజాలు నీదురహంకృతి. నీమొసటనే ప్రొద్దు పుట్టెనుగాఁబోలు.

నారా. ఓరీ నిరక్షరకుక్షీ, అష్టమస్థానాధిపతి యగుసౌమ్యుఁడు ద్వాదశమందు నీచస్థానాధిపుఁ డగురవినిం గూడినాఁడే! దీని కే మందువు? లగ్నమునకు నష్టమస్థానమున దేహాధిపతి యగుకుజుఁ డుండి భర్తృస్థానాధిపతి యగుశుక్రునిం జూచుచున్నవాఁడే! ఆశుక్రుఁడు కుజుని వీక్షించుచున్నవాఁడే! భర్తృస్థానాధిపతికి వ్యయమునం దాయుష్కారకుఁ డున్నవాఁడే! ఇన్నిదుర్యోగంబు లుఱిడి నను మొగమిచ్చకమునకు శాస్త్రవిరుద్ధంబు లాడ నగునా? మూఁడుమాటలలో

నాలుదప్పులా! ఇంతటిసమ్మికముక్కుకోఁతలా! ప్రభువు మంచివాఁ డని యనృతము లాడి మోసపుత్తురా? చెఱకు తియ్య నని వ్రేళ్లతో నమలుదురా?

ఈశ్వర. ఏమీ! దురాత్మా, కనకనిష్కము లిచ్చి గాజుపూసలు కొనినట్లు వింశతివత్సరంబులు దేశాటనంబుఁ జేసి జ్యోతిశ్శాస్త్రమునం దెంతప్రావీణ్య మార్జించితివి. నీ వొకపండితుఁడవా? దుర్గర్వదురభిమానములతో విఱ్ఱవీఁగెదవు. దాడిదన్ను వానిం దలఁ దన్నువాఁడు లేఁ డనుకొంటివా? ఏనుఁగుపల్లు పట్టిచూచినవిధంబున నన్నేల చెనకెదవు? సామజరాజమును దోమ మాన్కొన నేర్చునే? కొండను ఢీకొనిన మేషము బ్రతుకునా? నాతోఁ బ్రతిఘటించుట చిచ్చొడిఁ గట్టుఘట్టు కదా, హెచ్చరిక హెచ్చరిక.

నారా. ఔరా! ఎంతటిమాఢ్య మిది. నీనుడియుం దొక్కటయినను సత్యంబు లే దని శాస్త్రానుగుణంబుగ నేఁ బలుకుచుండ శాస్త్రసమాధానంబు లేక “శేషం కోపేన పూరయేత్” ననటు లాగ్రహగ్రహపీడితుఁడవై తిట్లకు మొద లిడితివే. నీబోఁటివిద్యాకించనునకా నే వెఱచువాఁడను? నీయఱచేతం బండ్లు వచ్చినపుడు నన్నుఁ గఱచెదవుగాని, (అనుచు రాజుంజూచి) చిత్రవర్మ మహాప్రభూ,

ఉ. నిత్యము నీదుసత్క్రియలు ♦ నెమ్మిగ నందుచు ధారుణీసురుల్
సత్యము వీటిఁబుచ్చి యిటు ♦ శాస్త్రవిరుద్ధము లాడిరయ్య; నీ
కత్యనుమోదకంబు లవి ♦ యంచు, సహింప వశంబె నా కయో
సత్యము నీదునందనకు ♦ సంభవమౌ విధవాత్వదుఃఖముల్. 21

ప్రభూ, చతుర్దశాబ్దంబున నీసుతకుఁ బతివియోగదుఃఖంబు ప్రాప్తించు నిది సిద్ధాంతము.

చిత్రవర్మ. హా హా! (అనుచు నిట్టూర్పు లూర్చుచు ఱిచ్చవడును.)

ఈశ్వర. (నారాయణభట్టారకుంజూచి) ఓరీ, దుర్మదాంధా, నాపైఁ గోపంబున నింతటి కర్ణకఠోరవాక్యంబులు పలికి ధరాతలేశ్వరునితొల్మి కత్తలముం జింపి యానందక్షేత్రంబున ఖేదబీజంబు నాఁటితివి. బ్రాహ్మణునం దిట్టిదుర్బుద్ధి యుంట కనకపాత్రంబునం గరళ ముంచినట్లయ్యె. ఈశాస్త్రంబు నీ వభ్యసించినది జాజులు మంగలంబున వేఁచినవిధంబు గాదే. ద్విజరూపచండాలుఁడవు నీవు. “న బ్రూయా త్సత్య మప్రియం” అను మానవవచనం బయినఁ బాటింపక చేటువాక్యములు దెలుపు నీ వొకమానవుఁడవే, శునకవాలంబురీతి వక్రిత మానవు. “అంగార శ్శత

ఘాతేన మలినత్వం సముజ్ఝతి'' యనుప్రవాదంబు నీయందు సార్థకతఁ జెందె. "పీత్వా కర్దమపానీయం భేకో మకమకాయతే'' యనెడియార్యవచనానుగుణంబుగ నల్పవిద్యచే నధికప్రసంగి వయితివి. "అద్య యుద్ధం త్వయా మయా'' అనుభంగి నీవిషయంబున మన కిరువురికిని గలహంబు ప్రాసంగెనుగదా. కానిమ్ము "కాచః కాచో మణి ర్మణి''అనునది తెల్లం బయ్యెడు. సత్యప్రతిజ్ఞుఁడ నే ననునది మఱచితివా?

ఉ. సారెకు భూరిభూసురులు • సత్యవిహీను లటంచుఁ గ్రొవ్వి వే
సారక పల్కి తీవ్ర నృపు • సన్నిధి నాలుకతీఁట దీఱఁగా
నూరిదురాత్మ యీగ్రహము • లోపునె కంజభవుండు నోపునే
నారసనాత్తసత్యవచ • నంబును రిత్తగఁ జేయఁబూనినన్. 22

(రాజుం జూచి.)

మహాప్రభూ, ఈమదాంధుని కావరపుంగూఁతలకుఁ జింతిలకు. నీసుత, శ్రీమతియై యశస్కరియై దశసహస్రవర్షంబులు దీర్ఘసుమంగలీత్వమున మని యుండును. ఊఱడిల్లుము.

చిత్ర. భూసురోత్తములారా; మీయాశీర్వాదం బెద నమ్మి యుండెదను. అప్రతిహతముగదా దైవగతి. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం'' అనెడిరీతి కా నున్నది వల దన్న వదలునా? విప్రోత్తములారా, పోయి వచ్చెదను.

(అందఱు నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము.

ఈశ్వరభట్టుగృహము

ఈశ్వరభట్టు (స్వగతము)

హా! హా! పేదకోపము పెదవులచేటయ్యె. "విప్రాః పశ్చిమబుద్ధయః'' అనునది సార్థకమయ్యె. ఏమి సేయుదు.

మ. అకటా భూవిభుసన్నిధిన్ సకలస • భ్యానీకము న్మెచ్చ మా
మకవాక్యంబు నమోఘ మంచు ఘనస • మ్మాన్యంబుగాఁ బల్కి, యే
నిఁక నామాటలు నిల్పకున్న వెత కా • దే మన్కి, యీయున్కి యూం
శక యున్నన్ భువికిం గొఱంతయె యప • ర్ణా రాజరాజేశ్వరీ. 23

హా! హా! విచారాంకూరము తుదఁ జిమ్మి, వివిక్తి వీటింబోవ, వావాదంబున, బీద కలచినభూరేరయుంబోలె మొలకపట్టుఁ బట్టితి, వాతప్పు గంజిపెడమూ టయ్యె. తేనెలోఁ జిక్కినయీఁగయుంబలె నురిఁ దవిలినపులుఁగుంబోలెనిపు డల్లాడుచున్నాఁడను. సభాస్థానంబున నాబుద్ధి పెడతలఁ బట్టెను. కొలవిచేఁ దల గోఁకికొనినటుల నారాయణభట్టారకు నేల చెనకితిని? ఇపు డే మనికొనినను గతజలసేతుబంధనంబుగా నుండునుగదా! కరు లుబ్బులిఁ జిక్కినఁ గరులెత్తనోపునుగాని పిపీలికానీకం బెత్త నేర్చునా? విచారాబ్ధినిమగ్నుఁడగునాబోఁటివానిని దరిఁ జేర్ప నాయీశానుబోటికి వశ మగును గాని యితరులతర మగునా! కాన నాలోకమాతను నామానసవీధి నిల్పి కాననాంతరంబుఁ జేరి నిశ్చలచిత్తంబునఁ దపం బ్బూనెద. హృదయమా! చెదరకుము.

సీ. మధుకైటభాసుర ♦ మరణైకకారణ, మహిషరక్షోవీర ♦ మథనలోల
శుంభనిశుంభని♦స్తంభమోహనదేహ, చండముండాసుర ♦ రుండమాల
రక్తబీజాంకుర ♦ రక్తబీజసహస్రి, రక్తాపహారిణి ♦ రక్తనయన
యపవర్గమార్గద ♦ యార్య కాత్యాయిని, నిర్గతదుర్గతి ♦ వర్గదుర్గ
తే. సర్వకళ్యాణి జగదంబ ♦ సర్వశక్తి,
మామకాభీష్టముల నిచ్చి ♦ మనుచునంత
వఱకుఁ దప మూని వనతల ♦ వాసి నగుచు,
నుండుఁ జిత్తమ చపలత ♦ నందవలదు. 24

ఇపుడే యీశ్వరతపోవనంబుఁ జేరి మాహేశ్వరింగూర్చి తపం బొనర్చెద.

నిష్క్రమించును.



శ్రీ

# సీమంతినీ నాటకము.

## ద్వితీయాంకము ప్రథమరంగము.

భృంగీశ్వరుఁడు (ఆత్మగతము)

ఆహా! అశ్రుతాదృష్టపూర్వంబుగదా యీతపోధను, నిశ్చలభక్తి. నిరాహార రాహిత్యంబు త్రయోదశాబ్దంబు లేభూతతతికి నైన సాధ్యంబే? గ్రీష్మంబునఁ బంచాగ్ని మధ్యస్థితం బేమి? వర్షర్తువున జలాంతరానుష్ఠానం బేమి! హేమంతంబున హిమనగవానం బేమి! ఏఫలాభీష్టకామి యై యీయిలాసురేశుం డీవిధంబునఁ దపంబుచేఁ గృశించెడినో! ఆపార్వతీపరమేశ్వరులపాదధ్యానంబుఁ దప్ప నితరభాష యీపాణినోట రాదుగదా: నారదునంతటిఘనున కీభూసురునిఘోరతపంబు మాన్పఁ దరము గాదయ్యె. ఇంద్రునకీఘోరోదంతం బెఱింగించెద నని యీమహానుభావుం డరిగె. ఆబిడౌజుం డేమి సేయం గలండు! రంభోర్వశీమేనకాద్యప్సరోనికరము గదా యతినియతు లగుయతుల యతులితతపోభంగంబున కతనిమూలబలంబు. ఇట్టివ్రతనిష్ఠుని నెవ రేమి సేయుదురు? ఆహా! ప్రదోషసమయం బయ్యె. వనంబుఁ జేరెద.

## ద్వితీయరంగము. తపోవనబాహ్యప్రదేశము.

భృంగీశ్వరుఁడు, రంభ, ఊర్వశి.

రంభ: అక్కా ఊర్వశీ, ఈతపోవనంబున మధ్యందినభాస్కరతేజో విరాజితుం డై యీభూమీసురుండు దపంబు సేయుచుండు నని యమరపురీనాథుండునుడివెను. ఆమహానుభావుం డీభాగంబున నెచట నున్నవాఁడో!

ఊర్వశి. రంభా, మనయుద్యమంబు నింద్యంబేకాక కష్టతమం బనియనుం దోఁచెడు. తపోనిష్ఠారిష్టుఁ డై తా నొకం డుంటయె చాలక మనల నేల యిట్టిచెట్టలకు నొడిగట్టింప మనఱేఁడు సాహసించెడినో?

రంభ. అక్కా, మనమొఱ విను వా రెరు?

, రంభా, నిజము. రాజు గొట్టిన మొగసాలకు మొఱవెట్టినట్టగు. అత్తపనికి నాఱడి కలదా?

ఊర్వశి. రంభా, మన మిపు డిట్టిమాటలాడుట కలివ్రాసినవెనుక సుట్టిఁజూచిన ట్లున్నది. సభలో రజ్జులాడి ప్రతిన నెఱపి యిపుడు వెనుతీయుమాటలు పెంచుట మానహాని, యశోహాని, కులహానియుంగదా.

రంభ. అటయిన నరయుయత్నంబు సేయుదము. ఆలస్యం బేల? అర్యముఁడస్తమించెడిని. కను,

మ. తనవేచేతులఁ గౌఁగిలింపఁగ సదా♦స్థగ మోముగో మొప్పఁగాఁ
దనరారం దనుఁ గాంచుపద్మినిని ర♦క్తం బాసి పోనయ్యెఁ గా
దనకుం గాల మటంచు నెంచియొకో చిం♦తం జేరె నాదిత్యుఁ డ
స్తనగస్థోరుగుహాగ స్వరాగ మొగి మిం♦చం గంటె కాల్గింటిరో. 25

ఊర్వశి. రంభా, తిమిరారివర్గంబుచే నిర్గతాంశుండై గిరిగహ్వరమునం డాఁగినవానిం జూడ నేల? ఉత్సవంబునం బౌరందరదిశగ వచ్చుచుండెడిపచ్చవిల్తుమామనుజూడుమా

చ. తనుఁ దనదారల న్మెరయఁ♦ దారఁగ నీయక పాపి, తాపముగ
బొనరిచి కల్వచెల్వను స్వ♦ పుష్టను నిష్ఠురవృత్తి నేఁచి, యా
శనిజనకుండు వ్రాయె నిది♦సాధు వటంచుఁ దలంచి మించియో
ఘనుఁడు సుధాకరుండు తిల♦కంబుగ నైందిరికిఁ బొల్చెఁ గాంచితే. 26

రంభ. అగునే! మనసాహసోద్యమంబునకుఁ బ్రోత్సాహకుఁడుగా నడతెంచెను. మన కార్యంబున కిది శుభసూచన రమ్ము.

భృంగీ. (దూరంబున స్వగతము) వీరో మింటివెలయాండ్రు. నిజ మిది కలహాశనునిమహిమ. ఆభూసురవరేణ్యుని తపోభంగం బొనర్ప సమకట్టిరికాఁబోలు! అతఁ డిట్టివారికిఁ బట్టువడునా?

(రంభ ఊర్వశి సమీపింతురు.)

రంభ. ఊర్వశి. భృంగీశ్వరులకు వందనంబులు వందనంబులు, (నమస్కరింతురు,)

భృంగీ. సహస్ర సోమయాజిపతిప్రాప్తి రస్తు. అచ్చరులారా వచ్చినకారణం బేమి?

రంభ. భృంగీశా ఇచ్ఛానుసారము విహరింప వచ్చితిమి,

భృంగీ. ఎవరింగూడి?

ఊర్వశి. తపోధనులం గూడి.

భృంగీ. తపోవనంబుపావనం బయ్యెను. కానిండు. రంభోర్వశులారా, దాక్షాయణీరహితుండయి తపం బున్న నాఁటిమహేశుండును శుకుఁడును నేఁ డిచటలేరే! మఱియేరిం గూడెదరు?

రంభ. భృంగీశా; హేళన మేలా? ఈసమయంబున వా రుండిన నీసమ్ముఖమ్మున నే నే నమ్ముకొని వచ్చు చుంటిని. బుద్ధి దినాభివృద్ధిచే వృద్ధియగుం గాదే?

భృంగీ. రంభా, నిజము పల్కితివి. అందున స్త్రీబుద్ధి.

ఊర్వశి. భృంగీశా, రంభమాటల కేమి! ఈవనంబున నుండెడియొక్క భూమీసురోత్తముని తపోభంగంబునకై యింద్రునిచే నియోగింపంబడి వచ్చితిమి. ఇది నిజమగు కారణంబు.

భృంగీ. ఊర్వశీ, ఇపుడు గదా ముద మందితి. అయిన నాభూదైవతోత్తమునితిరస్కృతిం గందు రని చింతిల్లెద.

రంభ. భృంగీశా, ఉత్సాహభంగముగా నీ విటు లాడకు. ఒకబోడిబాఁపనికి నోడినచో నీయాఁడుపుట్టువ దేల!

భృంగీ. హా! హా! ఇది గదా సత్యప్రతిజ్ఞ. మంచిది. రంభా, ఆత్మాదేవుం డీభాగంబునం దుండుభూరిభూరుహముక్రింద సమాధిం గూర్చున్నవాఁడు. వైళంబ వెడలి సందర్శింపుఁడు.

రంభఊర్వశి. మంచిది పోయి వచ్చెదము.

(అనుచు నిష్క్రమింతురు)

భృంగి. (ఆత్మగతము) వీరికి ముఖభంగ మింతలోనే యగును. ఆభూసురుండు గదలినఁ గదా వీరు పల్కరించెదరు. జాపడి యున్న వీ రేమి సేయుదురు! దూరంబున నుండి నేను వీరికృత్యంబులఁ జూచుచుండెదను. (నిష్క్రమించును)

## తృతీయరంగము, తపోవనమధ్యప్రదేశము.

రంభ, ఊర్వశి, ఈశ్వరభట్టు.

రంభ. అక్కా, ఇటు గనవే. గాదమున మాటువడినకాయయుంబోలె నీదుర్నిరీక్ష్య దుర్గమస్థానంబునఁ బద్మాసనాసీనుం డై తపంబు సేయుద్విజోత్తముని.

ఉ. ఇక్కడ భూరినిశ్చలత • నెక్కొన భూమిసురోత్తముండు దా
నెక్కుడుగన్నువానిఁ బర • మేశ్వరు మానసవీధి నిల్పుచుఁ
మిక్కుటమౌ తపంబు మితి • మీఱఁగఁ జేయుచు నున్నవాఁడు వీ
డక్కరొ చూడుమా శుకుఁడొ • యాపరివరాఖ్యుఁడొ యల్లభీష్ముఁడో. 27

ఊర్వశి. ఏదీ రంభా, చోటిమ్ము చూచెద. బెదరినవారికి నన్నియు భూతములే యైనట్టు నీకంటికి నెవ్వాఁడును శుకుఁడుగా నగపడుచుండును.

రంభ. అక్కా, ఆశుకునికి నే నోడితి నని పరిహాసంబుసేసెద వేల? ఈశుకుని నీవు లోఁగొనుమా, చూచెద.

ఊర్వశి. కాదు, రంభా పైకి నందఱు శుకులుగా నుందు రని యంటిని. భయపడ నేల? పల్కరింతము. (అనుచు వందనంబు లిడుదురు.)

ఏ మిది! నిద్రించువానికి నమస్కరించిన ట్లయ్యె. మనవందనంబునకు మాఱొక టయిన నాశీర్వచనంబు లేదే? అయినను మన మెవ రయినదియుఁ దెల్పుకొని జోహారు లొనంగుదము.

క. సామీ జోహారు నీ, పెను
పేమని యెన్న నగు నిన్నుఁ ♦ బేరిమిఁ గొలువం
గా మమ్ముఁ బనిచె విను సు
త్రాముఁడు మమ్మరయుమచ్చ ♦ రల మేము సుమీ. 28

(అనుచు మరల వందనంబు లిడుదురు.)

హా! హా! ఇతనినిశ్చలత యనిదంపూర్వముగ నున్నయది. రంభా,

మ. ధరణీనిర్జరుఁ డిట్టు తప్తుఁ డగుచుం ♦ దా నేమి సాధించునో
పరఁగ న్నా దగునంకపాళిగద సా ♦ ఫల్యంబుగా మేమె త
న్నరయన్ వచ్చి సమీపమందు వశ లై ♦ యాశింప నేఁ జెల్ల, మ
మ్మరచూపైననుఁ జూడఁ డీద్విజవరుం♦డంధుండొ షండుండొకో. 29

రంభా, ఈబొమ్మవలెఁ గదలక యున్నవాఁడే నాయత్నంబు బూడిదలోఁ హోమం బయ్యె.

ఊర్వశి. క. ఈరాతికిగిలగింతలవలె
నీతపసిని హెచ్చరింప ♦ నెవ రోపుదురే

రంభ. ఖ్యాతి చెడి చేతఁ గాదని
యీతఱి సురపతికినెట్టుల ♦ నెఱిఁగింపనగున్.

అక్కా ఊర్వశీ, ఇతండు నిజ మగుశుకుఁడుగదా! ఏనుఁగుమీఁదిసున్న మంద నెవరివశము? ఇతనితపోగ్నిచే సెగపొంతవెన్నయుంబలె, మనము గరఁగి నీరై పోదుము. శీఘ్రబుద్ధిః పలాయన మ్మనునుడి ననుసరించుటయ మనకుఁ గర్తవ్యంబు. బ్రతికి యున్న శుభములు వడయ వచ్చునుగదా?

ఊర్వశి. రంభా, వెఱవకు కించిత్కాలంబున మన మితని వంచింప లేము. ఇం దెందైనను దాఁగి యితనిచర్యఁ గన్గొందము. నేఁ డరుణోదయం బయ్యె. చూడు మీపా రందరదిశ.

రంభ. అవునమ్మా అక్కా, ఇటు గనుమా యీవారుణదిశాగతుం డైనచంద్రునిగతి.

చ. సకలవిధాలఁ బద్మినుల ♦ సంపదలన్ వికలంబుఁజేసి శీ
తకరుఁడు దత్ప్రియుం గని స్వ ♦ దారలఁ జిక్కినవారిఁ బశ్చిమా
ద్రికిఁ గొనిపోవుచో మిగత ♦ రిక్కలు చిక్కను వైరి కంచు బ
ల్వికలత నొంది కుంది వినువీధిఁ దొరంగుచుఁ గ్రుంకు నబ్ధిలోన్. 30

ఊర్వశి. రంభా, విధిహతుల కాపద లలలుంబోలె నొకటిపై నొకటి మూఁడుచుండును. సత్పురుషుం డెట్టిభంగం బైననోర్చుంగానిసమ్ముఖమ్మునస్వస్త్రీనిఁ బరపురుషుండు పట్టుట యోపఁడుగదా.

ఉ. భూరిసుఖంబులం దనుపు ♦ పూజితపూర్వదిశాంగనాసతి
న్గ్రూరతఁ జిక్కఁబట్టె నరు ♦ ణుం డని చంద్రుఁడు వర్ణహీనతన్
వారిధిఁ గ్రుంకు; సద్గణము ♦ వాసి తొరంగియు మానభంగ మే
యోరువఁ జాల దన్న, నెటు ♦ లోపును సత్తితినేత ఇట్టులన్. 31

రంభ. అక్కా, నిజ మనుకారణంబు వక్కాణించితివి. కోమలరసాలభ్రాంతిని గోయిలలు ముఖభంగం బైనను దమయత్నంబు మనవలె మానక యున్నవి కంటివే!

చ. లలి నవపద్మరాగశక ♦ లంబులచాయను బోలి యారుణో
జ్జ్వలకరకందళౌఘముల ♦ వన్నెలు రోదసి నిండి పర్వఁ గో
మలదళభాసమాన మగు ♦ మంజురసాల మటంచు భ్రాంతిఁ గో
కిలలు వృథాశ్రమంబునను ♦ గీడ్వడుఁ జంచువిఘట్టనంబులన్. 32

ఊర్వశి. రంభా, ఈదిక్కు గనవే యీచక్రవాకీదృగ్వక్రభావంబును.

క. పడమటిచంద్రునిఁ గనుఁగవ,
మిడుఁగుఱు లురలంగఁ జక్రి ♦ మితమధ్యకనుల్
నిడుతూర్పునఁ బొడమెడురవి,
నుడుగక యదె చూచు హర్ష ♦ ముప్పొంగ మదిన్. 33

రంభ. అక్కా: ఈమలయానిలుండు డొంకయుంబలె డాఁగి మార్గికులమాటునం దన మందిరంబగు చందనాచలంబునకుం బోవుమందగతిఁ గంటివే.

ఉ. పల్లవజాతిఁ జేరి నిర ♦ పాయముగాఁ గుసుమాసవంబులం
గొల్లగఁ ద్రావి, రాజసతిఁ ♦ గోమలిఁ బుష్పిణి రాత్రిఁ గూడి తాఁ
దెల్లఁగఁ దెల్లవాఱఁ గని ♦ తెక్కలికాఁ డగుమందమారుతుం
డల్లదె చిత్తవిభ్రమత ♦ నందము చేడ్వడఁ బోవుఁ దిన్నఁగన్. 34

ఊర్వశి. రంభా, ఈకాసారకైరవిణీపద్మినులఖేదమోదములు గనుమా. లోకంబున నొకరి దుఃఖంబు మఱియొకరికి సుఖం బనునుడి స్థాపించుచున్నవి.

శా. సౌరభ్యంబు చలించె, జాఱెఁ దనురు♦క్సారంబు, నాప్తాళియున్
దూరం బయ్యె నటంచుఁ గైరవిణి తా♦దుఃఖింప; నుత్సాహవి
స్తారామోదము మీఱఁ బద్మిని పరి♦స్తం బయ్యె నంచున్నగెన్
వైరిస్త్రీకి ఘటిల్లుదుఃఖము ముదం♦బై యుండదే యేరికిన్. 35

రంభ. అక్కా, ప్రభాతం బయ్యె. పూషుండు జగత్ప్రేపకుండై గగనపీఠాధిష్ఠితుం డయ్యె:

మ. తిమిరోత్సారణ మబ్జశోకదళనో♦త్సేకంబుఁ జంద్రప్రభా
రమ కారాటముఁ జక్రపోషణముఁ జం♦ద్రిపప్రస్తరాంతర్గళ
ద్విమలాంభశ్చటశోషణంబుఁ గలిగెన్ ♦ విఖ్యాతి నోరార య
ర్యమతేజోవిభవంబుఁ జూడ నుతిపా♦త్రం బౌఁగదా ధాత్రిలోన్.

ఇట్టికర్మకరికిఁ గరపుటంబులు జోడించి వందనం బిడి యీయారంబునఁ బొంచి యుందము. (అనుచుఁ బోవు చుండ భృంగీశుం డెదు రగును.)

రంభోర్వసులు. భృంగీశులకు వందనంబులు (అనుచు నమస్కరింతురు.)

భృంగి. కళ్యాణ మస్తు. రంభోర్వసులారా, రాత్రి మీపని ముగిసినదా? ఇపుడు దెల్ల వాఱెను గదా.

ఊర్వశి. భృంగీశా, ఏమి సేసినను భూసురుండు గదలఁడు. అది యెట్టిమనోదార్ఢ్యమో?

భృంగి. ఊర్వశీ, ఆతాపసి నీకును వశుఁ డయ్యెఁగా.

ఊర్వశి. భృంగీశా, తాపడినవాని నే నేమి సేయఁగలను. చేతన్య ముండినంగదా, నా మంత్రంబు సాగును.

భృంగి. ఊర్వశీ, నీకు సహాయముగా రంభ యున్నదే? రంభప్రతిభ దినదినాభివృద్ధిగా నుండును. ఆతి కయినను జేతన్యంబు గలిగించునంతటిప్రావీణ్యము దానికిం గలదు.

రంభ. భృంగీశా, న న్నేల హేళన సేసెదవు? పదుమూఁడువర్షంబులతపంబును నేక రాత్రి చెడఁగొట్టఁ దర మగునా! ఈదినం బిచట డాఁగి యుండి యాతనిచర్యలు గుర్తెఱిఁగి మరల నీరాత్రి యత్నించెదము.

భృంగి. ఓహో! మఱియొకరాత్రియాశ మీ కున్నదా? దివారాత్రంబుల భేదము మీయం దున్నదిగాని యతనికి నేకరూపం బై యుండు. మంచిది కానిండు. పోయి వచ్చెదను. (అనుచు నిష్క్రమించును.)

(రంభోర్వశు లొకయారంబున నుందురు.)

(పార్వతీపరమేశ్వరులు ప్రవేశింతురు.)

పరమే. అర్ధాంగీ, నినుఁగూర్చి తపంబు సేయువిప్రోత్తమునియభీష్టము దుర్ఘటముగా నున్నది, వానినిగుఱించి నీ వేల సంతపించెదవు?

పార్వతి. నాథా, దుర్ఘట మనుకఠినశబ్దంబు మీవలన నీదినంబున విన నయ్యెనే యని చింతిలు చున్నదానను.

పరమే. నాతీ, ఆభూసురోత్తముఁడు పూర్వజన్మకర్మానుసారంబుగ నొకరాజసుత నొసట విధాత వ్రాసినవ్రాఁతఁ దుడిచివేయింప యత్నించినాఁడు,

పార్వతి. ప్రాణనాథా, అది దుర్ఘట మెటుల?

సీ. ఆయువుపరిమితి ♦ వ్రాయుధాతశిరంబు
ఖండించుపనియుదు♦ర్ఘటముగాదె
అలమృకండునిపట్టి ♦ కాయువు నించెడు
కరుణ పూనుటయు దు♦ర్ఘ టము గాదె
ప్రాణధనంబుల ♦ పాటచ్చరునిపాలి
కాలుండనగుటయు ♦ ర్ఘటముగాదె

సర్వలోకంబులు ♦ సమయించుహాలహాల
కబళనంబదియుదు ♦ర్ఘటము గాదె
తే. యిన్నిదుర్ఘటముల నెల్ల♦సన్నఁజేసి, నట్టివారికి నఘటన♦లెట్టివేనిఁ
నేలకలుగును ప్రాణేశ♦యేల వలదె, బీదబాఁపనిరక్షించి♦ పెద్దఁజేసి.

పరమే. నాతీ, అఘటనాఘటనసామర్థ్యంబు నాకుం గలదు. అయినను నీపని యసాధ్యం బనియే నేఁ దలంచెద. ఆరాజసుత, పూర్వజన్మకర్మసామాన్యమునకుం జేరి కగాఁ బాపగ్రహాక్రాంత యై యున్నయది. కావున దుర్ఘట మని నేఁ జెప్పితిని.

పార్వతి. ప్రాణేశా, మీ రది దుర్ఘటం బని తలఁచినను మీయనుగ్రహాతిరేకంబున నా కది దుర్ఘట మని తోఁపదు.

పరమే. సతీ, అత్యద్భుతంబులు గదా నీమాటలు.

పార్వతి. అద్భుతం బేటు! మీవాగ్దానం బైన మీరు రక్షించికొనఁ నెన్నరా ?

పరమే. ఎన్నుదును. ఆప్రశ్న యిపు డేల ?

పార్వతి. ఇంద్రసేనునకు దశసహస్రవర్షంబులు మనియెడిపుత్త్రభిక్ష మీ రియ్యరా?

పరమే. ఇచ్చితిని.

పార్వతి. ఆరాజసుతునకు నీరాచపట్టి నిచ్చి పరిణయంబుఁజేసిన.

పరమే. నాతీ, నీబుద్ధికుశలతకు నే నచ్చెరు వందితి, నీప్రయత్నంబుచే నారాజసుతునకుం నించుక కష్టంబు ఘటిల్లు. అది వానియశోభివృద్ధిగాఁ బరిణమించు. కా నిమ్ము, నీభక్తుం డదిగో నచట నున్నవాఁడు. వేగమ్మె వానిని బోధించి వరమ్ము లిచ్చి రమ్ము. ఆప్రాంతంబున నేనంచరించు చుండెద. (అని నిష్క్రమించును.)

పార్వతి. (ఈశ్వరభట్టుంజేరి)భక్తాగ్రేసరా, లే లెమ్ము. తప మింకఁ జాలింపుము. (అనుచు మై నిమురును (ఈశ్వరభట్టు లేచి దేవిం గని సాష్టాంగనమస్కారము లాచరించి.)

ఈశ్వరభట్టు.

దండకము. శ్రీమన్మహాభారతీస్తుత్యకీర్తిప్రచారా, స్ఫురద్దివ్యవిద్యావిచారా, లసద్రత్నహారా, యుదన్వద్గభీరా, సుమేరోరుధీరా, వినీలాహివేణీ, చలద్భృంగిజైత్రేణి, సుధాస్నిగ్ధవాణీ, కనత్పద్మపాణీ, మహేశానురాణీ, నతేంద్రాణి, నారాయణీ, యోపురాణీ, ధరానాథపుత్రీ, తటిచ్చారుగాత్రీ, నమద్భక్తమైత్రీ, జగజ్జాలకర్త్రీ, నినుం గాస్తోత్రముం జేయఁగాఁ బత్త్రిపత్త్రాదిదేవప్రభుల్ చాలరన్న న్నినుం బోలుదీనుం

డెటు ల్నేర్చు నోయమ్మ మున్ దేవతల్ దైత్యసంతాననాశంబుఁ గాంక్షింప
దైత్యాంబ యత్యుగ్రనిష్ఠన్ దపం బంది వాహద్విపద్గాత్రు పుత్రుం గనన్
వాఁడు సర్వప్రపంచంబునున్ గాసి సేయన్ భయంబందుచున్ జర్జరీభూత
చేతస్కులై నిర్జరుల్ ధాతృపీతాంబరేశానమూర్తిత్రయం బుండుతానంబునుం
జేరి యాసైరిభాకారు దుర్వర్తనం బెల్లఁ జెప్పంగ నామూర్తులం దుద్భవించెం
గదా శక్తి; యాశక్తి వీవే కదా యప్పుడే గుప్పునం దెప్పరంబైననిప్పుల్ గనుం
గోనలన్ వ్రాలి రక్షోధినాథున్ వడిం బట్టి శిక్షింపవే వానివంశంబు నిర్మూ
లముం జేయవే యింద్రు నానందవార్ధిన్ వెసన్ ముంపవే యార్తులం బెంపవే
తల్లి సాధ్వీమతల్లీ నిను న్నేను వర్ణింప శక్తుండఁ గా నంచు నీపాదపద్మంబు
లందున్ ద్విరేఫంబురీతిన్ సదా వ్రాలి నే మందు నమ్మా ననున్ వీడఁ గాన్యాయ
మేమమ్మ రక్షింప నమ్మా గతిం గాన నమ్మా వర మిమ్ము గౌరీ పురారాతినారీ
సురారాతిమారీ శివా శాంకరీ నిన్ను నే నమ్మితిన్ దేవి శ్రీమన్మహాదేవదేవి
నమస్కారము ల్వేనవే ల్సేయుదున్ శాంభవీ గౌరి శాకంబరీ రక్షణోద్ధండ
నేనమ్మరో నీకునున్ భక్తిచే మ్రొక్కెదన్ మ్రొక్కెదన్ మ్రొక్కెదన్. 38

(పునఃప్రణామంబు లాచరించును.)

పార్వతి. పుత్రా లే లెమ్ము, నీయింగితం బెఱింగితి. అభయం బిచ్చితి. లెమ్ము లెమ్ము.

ఈశ్వరభట్టు. క. ముల్లోకము లుదరంబునఁ,
జల్లగ నిడి ప్రోచునట్టి • జననికి నెల్లం
దెల్లము గాదే తడయక,
తల్లీ రక్షించు రాజ • తనయన్ నన్నున్. 39

తల్లీ. పిచ్చుకుంటపై భాగీరథి వచ్చినరీతి నీదర్శనంబుచేఁ బావనుండ నయితి. కృతార్థుఁడ నైతి. అంబా, తనగొంతునకు గాలంబు దాఁ దెచ్చుకొనినలాగున నల్లాడుచున్నవాఁడను. చిత్రవర్మ సభాస్థానంబున గర్వించి మీఁ దెఱుంగక వాదాడి రాజసుతదశసహస్రవర్షంబులు ముత్తైదువుగా సామ్రాజ్యసుఖంబు లనుభవించెడి నని వచించితి. నన్ను సత్యప్రతిజ్ఞునిఁగాఁ జేయుభారము తల్లీ నీయం దుంచితి.

పార్వతి. పుత్రా, వెఱవకు. నైషధేంద్రునిసుతుఁ డగుచంద్రాంగదుని నారాజతనయ చేపట్టె నేని నీవు సత్యప్రతిజ్ఞుం డయ్యెదవు. గ్రహయోగంబున నారాచపట్టికిఁ బతి

వియోగంబు గలిగినను దత్పరిహారంబు క్షిప్రంబుగఁ జేకూరి యుడుగని ధైర్యదువ
త్తైమె నెగడుం. ఈయర్థంబు రహస్యంబుగా నుంపుము. నీకు శుభ మగు.
(ఈశ్వరభట్టు నమస్కరించును) పుత్రా, నీవు సత్యప్రతిజ్ఞుఁడ వని నిత్యకీర్తిఁ బడ
యుదువుగాత. నేఁ బోయి వచ్చెద (నిష్క్రమించును.)

ఈశ్వర. ఆహా! నేఁడుగదా నే ధన్యుండ నయితి. చంద్రాంగదసీమంతినులకుఁ బాణి
గ్రహణంబునకు సాహసింపవలయును. నాగురుభార్య యగుమైత్రేయికిం దెలిపి వా
రిరువురకును నన్యోన్యాభిలాష గలిగించెద. శేషార్థంబు దేవియాజ్ఞానుసారంబు
గుప్తంబుగా నుంచెద, (నిష్క్రమించును.)

(రంభోర్వసులు ప్రవేశింతురు.)

రంభ. అక్కా, మనఱేఁ డెంతభయగ్రస్తుఁడే? తనపదవి నెవ రపహరింతురోయని
ముక్కుఁ బట్టికొని గూర్చున్నవారి నెల్లరనుం గని వెఱచుచుండును. కంటివే
యీద్విజుం డొకరాజతనయసౌభాగ్యంబునకై తపించుచుండెను.

ఊర్వశి. నిజము నిజము, ఇది మనఱేనితప్పు గాదు. అతనిసరసం జేరువా రిరీతి నాతని
భీతునిం జేయుదుర్రు. అతనిహితు లనిపించుకొనుట కుపాయం బిది.

రంభ. మన మిపుడే పోయి యీయుదంతంబు దెలిపిన మనరాజు సంతసించు. రమ్ము
పోవుదము (నిష్క్రమింతురు.)

## చతుర్థరంగము.

మైత్రేయి, యోగిని, సీమంతిని.

మైత్రేయి జప మొనర్చుచు గూర్చుండి యుండును.

యోగిని. (వచ్చి మైత్రేయికి వందనంబు లిడి) తల్లీ, చిత్రవర్మసుత సీమంతిని భవద్దర్శ
నంబునకై వేచి యున్నది. ఆసతిచ్చినం బిలిచికొని వచ్చెద.

మైత్రేయి. సీమంతిని వచ్చినదా? వేగమ్మై రా నిమ్ము.

(యోగిని నిష్క్రమించును)

మైత్రేయి. (స్వగతము). హా! హా! ఈశ్వరభట్టువేఁడినయర్థం బీశ్వరానుగ్రహంబున నేఁడె
యనుకూలించెడి నని దోఁచెడు.

(సీమంతిని యోగిని ప్రవేశింతురు).

సీమంతి. (మైత్రేయిసమ్ముఖమ్మున నిలిచి) అంబా నీపాదారవిందంబులకు వందనంబు
లొనర్చెద (అనుచు నతు లిడును),

మైత్రే. సామ్రాజ్యయుతదీర్ఘసువాసినీత్వమున నిను దైవంబు మన్పుఁగాత.

సీమంతి. అంబా, మీబోఁటిసతులవచనం బనవరతంబు నమోఘంబుగదా.

మైత్రే. బిడ్డా, సందియం బేమి! సీమంతినీ, నీముఖవర్ణహీనత నీహృదయాంతర్గతవ్యాకులత వెలివేయు చున్నది. కలంతకుం గారణం బేమి?

సీమంతి. తల్లీ, కారణం బే మని తెలుపుదు! తెలుపక యెటు నిలుపుదు?

మైత్రే. బిడ్డా, నామ్రోల సందియం బేల?

సీమంతి. జననీ, సందియ మందిన ముందటిగతి యెద్ది! తెలిపెదను.

సీ. అమ్మరో వినవమ్మ ♦ నెమ్మనమ్మునఁ గల్గె
నుమ్మలిక మిఁక ♦ నుండఁజాల
నిన్న నామిత్త్రులు ♦ విన్నవించిరి తల్లి
చిన్ననాఁటియుదంత ♦ మెన్నఁజాల
ధర్మతత్త్వవిదుండు ♦ దైవజ్ఞుఁ డొకఁడు నా
జాతకంబును జూచి ♦ చర్చఁజేసి
పదియునాల్గవ యేఁటఁ ♦ బతివియోగప్రాప్తి
యనుచుఁబల్కె నటమ్మ ♦ వినఁగఁజాల.

తే. అవనిఁ బుట్టినయతివకు ♦ నంతకన్న
నంతకునిబాధ లెక్కుడే ♦ యమ్మచెపుమ
యట్టిబ్రతు కేఁక భువిలోన ♦ నకటవలదు
కాఁ దగినకర్జ మది యెద్ది ♦ కరుణఁదెలుపు.

(అనుచుఁ బునఃప్రణామంబు లాచరించును.)

మైత్రే. బిడ్డా, లే, లెమ్ము, వెఱపకు, చింతలకు, ఊఱడిల్లుము, నీ కొకహితం బుప దేశించెద నాచరింపుము.

ఉ. అంతకనాశకున్ సతిని ♦ నాదిమదంపతులన్ మనంబునన్
దాంతియు శాంతియుం గలిగి ♦ తప్పక యర్చన సేయవమ్మ యు

త్యంతశుభమ్ము నీ కగును ♦ నాయువు హెచ్చును నీదుభర్తకున్
వంతయు నంతరాయములు ♦ వచ్చిన నేమఱకమ్మ వారలన్. 41

తనయా, అశేషదోషశోషణం బగునుమామహేశ్వరులపూజనంబు నంతతానంత సౌభాగ్యభోగ్యభాగ్యం బొనఁగూర్చు. ఏమఱకు మిది. తనయా, దీనిని మానసవ్రతముగానుంచి.

ఆ. వె. సోమవారమున ను ♦ మామహేశ్వరులుగ
దంపతులను బూజఁ ♦ దనుప వమ్మ
వ్రితములందు నిద్ది ♦ వరము సర్వోత్తమ
వ్రితము దీనఁ గల్గు ♦ వరఫలంబు. 42

సీమంతిని.తల్లీ, నీహితోపదేశంబు గల నైన మఱవక యేకాలంబునను మనంబున నుంచి యాచరించెదను. ఆనతిచ్చినం బోయి వచ్చెద.

మైత్రేయి.సీమంతినీ మఱచితి, నీకుం బరిణయోక్తసమయం బయ్యె. నీగురువరు లెవరై నయినన్ వరునిఁగా నేర్పఱిచి యున్నవారా?

సీమంతిని.(సిగ్గుతో) అంబా నా కేమియుం దెలియదు.

మైత్రేయి.బిడ్డా, లజ్జ వలదు. నీతలిదండ్రు లింతదనుక నేరినిం విచారింప రేని నీ కొక యుత్తమపురుషునినామంబు దెలిపెద. వానిం బరిణయం బాడితేని నీకు సమస్త మంగళంబు లొనఁగూడును. విన వలతేని వానిని దెలిపెద వినుము.

ఉత్సాహము.
అంగజోపమానసుంద ♦ రాంగుఁ డార్యసన్నుతుం
డంగజారిభక్తుఁ డవని ♦ నఖిలరాజపూజ్యుఁ డా
మంగళాంగు నైషధేందు♦మానితంపుసుతుఁ డు చం
ద్రాంగదుండు వానిఁ గొనుమ♦రమణి నీదుభర్తఁగన్. 43

బిడ్డా, కర్తవ్యాంశంబు దెలిపితి. పోయి రమ్ము, నీకు శుభమ్మగు.

(సీమంతిని నమస్కరించి నిష్క్రమించును.)

మైత్రేయి.(యోగినింగని) యోగినీ, కాఁదగినకార్యం బయ్యెను. యజమానులవారు వచ్చు సమయం బైనది.వారిదేవవిధికిన్ సమస్తంబు సిద్ధంబుగా నుంపఁ బోదమూరమ్ము.

(అనుచు నిష్క్రమింతురు.)

శ్రీ

# సీమంతినీనాటకము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

చంద్రాంగదుఁడు - యుగంధరుఁడు.

యుగం. చంద్రాంగదా, ఇఁక నిలు నిలు. మృగంబు మృగ్యం బయ్యె, అరణ్యంబు దాఁటి వచ్చితిమి,

ఉ. రాజకుమార వేటకు నరణ్యము గాదిది యొక్క లేడికై
రాఁజనునే బలం బచట రాపడదే నినుఁ గానమిన్.

చంద్రాం. సఖా.

రాజతనూభవుం డొక కురంగముఁ బట్టఁగఁజాలఁ డయ్యె నం
చా జను లాడరే బ్రతుకు హాస్యము గాదె ధరాతలంబునన్. 44

యుగం. మిత్రమా! పిల్లికిం దొరఁగు రాచిలుకవలె నీబారికి వెలిచి యా కురంగము బరువిడినను దానిం బట్టుటకుఁ బట్టు పట్టుట చెట్ట యని తోఁచెడు. పాఱెడు బండ్లకుఁ బదములు సాచుట తగునా? మన మిపుడు మనమేర మీరి పరధరావరుని సీమను సంచరించుచున్నాము. ఇచట నుండి మరలుటయే కర్జంబు.

చంద్రా. మిత్రమా! చూడుమా! యీదిక్కు. మనల మొయ్యెలగుట్టం ద్రిప్పిన మృగ మా వనంబును జొచ్చుచున్నయది. మన మందాఁకం బోయి చిక్కినం బట్టుదము. చిక్కకున్న నించుక విశ్రమించికొని మరలుదము.

యుగం. చంద్రాంగదా? ఇట్టి మృగముల వెన్నంటు వారికిఁ జెట్ట లొడిఁగట్టి నట్ట నుటకుఁ బురాణేతిహాసంబులు దార్కాణములు గావా?

చంద్రా. మిత్రమా. మృగవ్యాజమున శుభం బొనఁగూడిన కథ లెన్ని లేవు? కార్యారంభమున శుభ మెన్నుట కర్జము.

యుగం. అటు లయిన నచట నీకుఁ గళ్యాణంబు గలుగు నేమో? అంతరాయంబుగా నే నవతరించు టేల పోదము.

(అనుచునించుక నడచి నిలిచి)

యుగం. చంద్రాంగదా, చేరువనుండెడి యీ వనసారంబును గాసారసారంబునుం గంటివే?

సీ. ఉత్ఫుల్ల పుండరీ♦కోత్కర రమ్యమై
కమనీయకల్హార♦కలిత మగుచు
గనకాంబుజవ్రాత♦ కనకకారండవ
కలరవాకలితసం♦కలిత మగుచు
మకరంద మధుపాన ♦ మత్తాళి మధురవా
ఙ్మంజులేందీవర ♦ మహిత మగుచు
తారకాయిత సము♦త్పల భాసితం బయి
తత చంద్రికాభ వా♦ స్తవ్య మగుచు

గీ. చారుతర వీచికాసార♦జాలసిక్త
తీర తరుమూలసంచార ♦ మారుతముల
నలరు కాసార మీ వన♦తలము నందు
గంటె చంద్రాంగదా నీదు♦ కన్ను లలర. 45

చంద్రాం. మిత్రమా, నిజము ఈ వన సీమంతినీ ద్యుతి యంత కంతకు హెచ్చు చున్నయది.

యుగం. రాజసుత సీమంతినీ తనుద్యుతి బలెఁ గదా.

చంద్రా. మిత్రమా, ఆ రమణీమణి నామస్మరణచేతనే నా శరీరం బొక భంగి వికారంబు నొందెడు. ఆ కోమలాంగినిఁ గన్నులారఁ గనియెడి భాగ్య మెన్నఁడో?

యుగం. చంద్రాంగదా, కురంగమును వెన్నంటి వెదకు లక్షణమా యిది?

చంద్రా. కాదు సఖా, ప్రస్తావవశమున నా మాటలు వచించితిని. మిత్రమా; ఈ వనంబును దాటి వనవైభవంబుఁగని మరలుదము రమ్ము.

యుగం. మిత్రమా, నీ యిష్టానుసారంబు జరగనిమ్ము (అనుచు నించుక దవ్వు నడచి) చంద్రాంగదా, నిలు నిలు. ఈ యుద్యాన వనంబున యువతుల కలకలంబు వినఁబడియెడు. స్త్రీ లుండు తటి మనము పోఁజనదు.

చంద్రా. అటు లయిన మనము దూరంబున నుండి గందము (అనుచు దూరంబున నిలిచి వనంబు నందు విహరించు యువతులం గని.)
మిత్రమా. తరుణీ గణ భూషణంబై తనరారెడి యా తన్వి సీమంతిని యని నాకుం దోఁచెడు. ఇతర స్త్రీల కా సౌందర్యం బేల గలుగు. (అనుచు వ్రేలు చూపి) మిత్రమా, కంటివే!

మ. మతిమాంద్యంబున మానినీ తతిని వే • మా రూరకే సృష్టి చే
సితిఁ గల్పాది నటంచు ధాత మరల • నైన్నారు స్త్రీరత్నముః
క్షితి సృష్టించె ననః సతీమణి తగః • శృంగార సారంబ యై
వితకాదే నుతియింప వేధకును నా • వేనోళ్ల శేషాహికిః. 46

హా, హా, అశ్రుతాదృష్ట పూర్వం బీ సౌందర్యంబు,

యంగం. మిత్రమా, ఆ కురంగమును బట్టు పట్టుదల మాని యీ కురంగనయనం బట్టం బూనితివా యేమి?

చంద్రా. కాదు సఖా, సౌందర్యం బట్టిది యని వర్ణించితి. మన మీ వన్నంబు మెల్లనఁ జేరి యొక యీరఁబు దూఱి యా నారీమణి విహారంబు గనులారం గందము. రమ్ము. (అనుచు మెల్లన నడచును)

## తృతీయాంకము - ద్వితీయరంగము.

సీమంతిని. సుశీల. విమల. కలవాణి.

రగడ.

కలవాణి. మూల మూలల నేల డాఁగెదు • ముగుద డాఁగుడు మూత లాటల.
సుశీల. చాలు, కలనకుఁ గాలు ద్రవ్వకు • చాన నీ వికటంపు మాటల.
కలవాణి. కేలు కేలునఁ జఱచి పాడెదఁ • గీరవాణిరొ నన్నుఁ గూడుము.
విమల. బాలతోఁ జల మేల గోలా • పాడి నాతోఁ బందె మాడుము.
కలవాణి. నీలవేణిరొ నిన్నుఁ గెలిచెద • నీటి యీతల వచ్చి చూడుము.
సీమంతి. కాలమా యిది కలహమునకును • గలికిరో మన్ననలు వేఁడుము.
కలవాణి. ఇంతి యెంతటి వింత లమ్మరొ • యిట్టి మాటలఁ గలహ మగు నెటు.
సీమంతి. కాంత కలహంబులకు మూలము • కాఁబు కూఁతల పెచ్చు గా దెటు.
సుశీల. అమ్మ కననే సౌరభమ్ముల • నలరు నలరులు గొమ్మ గొమ్మకు.
కలవాణి. నిమ్మలను గొని పోద మటు దా • నిమ్మలకు నీఁక నుమ్మలింపకు,
సీమంతి. బాల, నేలను వాల కిటు లటు • బండికొని తిను మావి పంటిని,
విమల. కేలు సాచుచు నందికొమ్మా • కీలెఱిఁగి ముక్కంటి పంటిని.
కలవాణి, గోటఁ గిల్లకె త్రొవ్వి నీ విటు • కోమలాంగిరొ లేఁత మరువము.
విమల. చాటి తెల్పెద వీని నంటవె • చాన చెల్లును నీదు గరువము.
సుశీల. అన్నుమిన్నా పొన్న పూవులు • నందు నేమో నిక్కి చూడవె.

విమల. సన్నుతాంగిరో, నిన్ను నెత్తెదఁ ♦ జక్కఁగా నవి గనుచుఁ గోయవె.
సుశీల. మేలు మే లిది యెంత తెంపరి ♦ మీఁది కొమ్మనుఁ బట్టె వెసఁ జని.
సీమంతి. చాలుఁ జాలిఁక నసలు గొనుపని ♦ చల్లఁగాఁ గూర్చుండ మటు చని.
కలవాణి. అలసగమనరో యలసి తేమే ♦ యలరులను గొని వత్తు మటఁ జను.
సీమంతి. వెలఁది నే నెటు మిమ్ము వదలుదు ♦ వెడల నెటులగు నమ్మ కనుఁగొను. 47

---

కల. అమ్మా సీమంతినీ, ఆరామవిహారంబునం దలసితివి గాఁబోలు.

సీమంతి. అగు నే సఖీ, నీకు నలసట లేదా.

కలవాణి. సఖీ, విహారానురాగంబున నెంతటి యలసట యైన లవమాత్రముగఁ దోఁచుచుండును.

విమల. అది నైజమని యీ నన సైతము దెలుపుచున్నయది.

క. అనురాగం బున్నయెడన్
ఘనత లఘిమఁ గాంచు నుచటఁ ♦ గన నైజంబే
కొనగోటి సోఁకు సైఁపని
నన యోర్వదె భృంగ చరణ ♦ నారాచములన్. 48

సీమంతి. సఖీ, ఈ భృంగీభృంగము లభంగుర భోగానుభవంబున భాసిల్లుచున్నయవి కంటివే.

కలవాణి. సఖీ, నిజము.

తే. పద్మపాళి మధూళిమఁ ♦ బరఁగఁ గ్రోలి
హాళి మధుపాళి సుఖకేళిఁ ♦ దేలె సకియ
విమల. ఇంతి ; రసదాళి ధన్వికి ♦ నీ సదాళి.
నారియై గాదె సుమపాళి ♦ నారి నేచు. 49

సీమంతి. సఖులారా, ఈ సుశీతల సురసాలచ్ఛాయఁ గల తావులు తావులచే శోభావహమైనవి. ఇంచుక విశ్రమించుకొందము.

(అనుచుఁ జెట్లమఱువునఁ గూర్చుండురు)

(చండాంగద యుగంధరుల ప్రవేశము)

చండాం. మిత్రమా, ఆబోటినిఁ గని నంతటి నుండి పర్వతమువంటి నా ధైర్యము నీటికంటెను బలచనై పఱచెను గదా.

మ. అతిచిత్రం బిది ధాత్రి నెందుఁ గన మా♦హా యశ్రుతాదృష్టమా
సతిరూపం బిల; మోముఁ జూపి మదికి♦న్సంతోషము న్గూర్చి; నా
ధృతిగోత్రంబును గ్రుచ్చి బైట దివిచెన్ ♦ దృగ్బాణపాతంబునన్
యతిముఖ్యుం డయినన్ వ్రతక్షితి మనో♦వ్యాపారమం దూనఁడే.

యుగం. మిత్రమా, నీ వీకఁ బట్టణంబుఁ జేరుట కష్టంబు: ఆసతి తన వీడుఁ జేరుట దుర్లభంబు.

చంద్రా. కారణంబేమి ?

యుగం. పరస్పర వీక్షణశృంఖలముల చే మీ రుభయులు బంధింపంబడితిరి.

చంద్రా. మిత్రమా, ఏల యీ హేళన.

యుగం. చంద్రాంగదా, ఆ సతీమణి తనసఖులతో భాషించుచున్నను నీపై దృష్టి తప్పక, యుంచి యుండెను. నీకు దృష్టి తాఁకునని వెఱచితిని.

చంద్రా. నిజము, మిత్రమా, వలచిన వనితల వాల్కనుఁగొనల మహిమ వర్ణింపవశముగునే.

ఉ. ఇంతుల వాలుచూపు లొక♦ యించుక వాలిన యంతఁ జల్లనో
గాంతదళద్వికాస నవ♦ కమ్ర సుసౌరభ మల్లికాకృతిన్
చింతను చిచ్చునగ్గడపుఁ♦ జెచ్చెర వాని మరల్పఁగా నహో
గంతు విచిత్రనూత్న సుమ♦కాండము లంచ నియెంతు వానినిన్. 51

యుగం. చంద్రాంగదా, ఈ కతంబునఁ గదా నే నచ్చటి నుండియే మరలుద మని వేఁడికొంటిని. వలదనిన వినక యిచ్చటికి వచ్చితివి, ఒక యబలకు నోడితివి.

చంద్రా. మిత్రమా, ఆరమణీరత్నమును వీక్షించిన తఱి నుండి నేఁ బరవశుఁడ నైతిని.

యుగం. చంద్రాంగదా, నిన్నుఁ బోలు ధైర్యశాలికీ యవస్థ తటస్థించిన నిఁకనా యబల కెటు లుండునో దైవం బెఱుంగు.

చంద్రాం. యుగంధరా, నీ యభిప్రాయంబు తప్పని చెప్ప నొప్ప, ఈ మానినీమణి మా రాకుగముల కభేద్యంబగు వస్తుసాధనలు వహించి యున్న ట్టగుపడెడు. కావున్న సన్నలంచిన మరు నలబలమునకు నా యలినీలవేణి నలయింప నలవి కాకున్నే,

సీ. కాలాహివేణి యీ♦ కలవాణి యని కాదె
మలయానిలుఁడు చాన♦ మలప కుండు

గాంగేయసుమగంధి ♦ గాఁబోలు నని కాదె
యళికుంతలనుఁ జేర ♦ నళుకు నళులు
రామాంగి యని కాదె రహిఁజెడి పికములు
పికవాణి నేప కో ♦ పికను దాల్చె
ఐశ్వర్యవిఖ్యాతి ♦ నలరారు నని కాదె
మరుఁడు సోమరివలె ♦ మరలి యుండు.
గీ. గాక వీరేల యిత్తఱిఁ ♦ గాంతఁ జూచి
సోకి మోమెల్ల సుడిచుట్టి ♦ కూక లిడుచు
బాణముల నేసి బాధించి ♦ భ్రాంతి గొలిపి
జయజయధ్వని సేయక ♦ సైఁచువారు. 52

యౌగం. మిత్రమా, పచ్చవిల్తుని బాణముల నెచ్చిన వారి కెల్లరకు నిట్టి పిచ్చి వచ్చునా గాఁబోలు, నీమనం బిపు డధైర్యం బనుసరించె, ఆయువతీమణులు వెడలు సమయంబయినది. మన మిచట నుండంజనదు, పూర్వంబు భంగి నీ యారాంబున డాఁగుదము.

చంద్రాం. యౌగంధరా, ఆ నీలనీరదవేణి నెఱికురుల చీకటిం బడితిని. నీవే పురోగామి వి కమ్ము,

యౌగం. మంచిది, అటులనే చేసెదను (అనుచుఁ బిలిచికొని పోవును.)

(సీమంతిని కలవాణి విమల సుశీల ప్రవేశించుచున్నారు.)

కలవాణి. అమ్మా, సీమంతినీ. ఎదుట నున్న వరపున్నాగము నా, యటు చూచితివి.

సీమంతిని, (ఉలికిపడి) ఏమి, కలవాణీ, ఏమీ, ఆ పురుషరత్నమును నీవును జూచితివే?

కలవాణి, ఏ పురుషుని?

సీమంతిని. ఏ పురుషుని జూచితి నని నీవు నన్నడిగితివి.

కలవాణి. అయ్యో పిచ్చిదానా, పున్నాగవృక్షవైభవమును గంటివా యని యడిగితిని.

సీమంతిని. కలవాణి, నేను నిజముగా నొక పురుషరత్నమును వనవిహారంబు సేయుతఱిం జూచితి. అత్తఱి నుండి చిత్తము వికారాయత్తమై యున్నయది. ఏమియుం దోఁపక యున్నది. ఆ పురుషవిగ్రహంబు మనగృహంబున నుండు చంద్రాంగదుని ప్రతిమకంటెను రూపయౌవనవిభవంబుల మించుచున్నయది,

చ. హిమకరరూపసంపద స ♦ హింపని సుందరుఁ డమ్మచెల్ల: య
ర్యమనిభతేజుఁ డమ్మ, మగు ♦ ణాకరుఁడే యని తోఁచెనమ్మ, రా
కొమరుని చిన్నె లన్నియునుఁ♦గోమలి వానికి నుండు నమ్మ, యా
సుమశరరూపుని న్గనుచు ♦ సొక్కుచు సోలితి నమ్మ బాలిచేఁ. 53

కలవాణీ. నా మనం బంతయుఁ గలఁత చెందినది; నన్నిఁక మాటలాడింపకు.

కలవాణి. సీమంతినీ, అస్తమయంబు గావచ్చె. ఇఁక నిట నిటు లుంట మేలుగాదు. వీడు నకు వెడలుము; ఆ పురుషుం డెవఁడో నేఁ దెలిసికొని వచ్చెద; (అని వెడలును)

సీమంతి. (కలవాణిపలుకులువినక) హా, హా, మనసిజా, నామనంబునఁ బుట్టి నన్నిటు కలంచుట ధర్మమా? నిజము. నిజము. శ్రీభవుఁడవు నీకు సౌమ్యత వచ్చు నెటు లఁ? ని న్నెవ రెంత హింసించినను నీబలం బడఁగదు కదా.

చ. అబలలు గేశపాశముల ♦ నంటఁగఁ గట్టిరి నీదు బాణముల్
ప్రబలిన నీ శరాసనము ♦ బాలురు పిప్పిగఁ జేసిరయ్యొ, నీ
శిబికయు జీర్ణ మయ్యె ఫణి ♦ జిహ్వల పాలయి, రౌద్రవహ్నిచే
గబళితమయ్యె దేహ, మెటు ♦ గల్గెను నీ కతిశక్తి మన్మథా. 54

హా, మారుని దూఱిన నేమి ఎవరిని దూఱిన నేమి; నా విచారంబు దూరంబుగా దయ్యె.

విమల. అమ్మా. సీమంతినీ, ఏమి యీ వికారంబులు వదలుము ఈసరోవర సరోజినినిఁ గనుము.

గీ. తన్ను విషజాత యని నాథుఁ ♦ డెన్ని సంజ
కలికికిం జిక్క చనుచు నా ♦ కస్మికముగ
గరము శోకింప నళిని సు♦ఖమ్ముఁ దెలుపు
నఱమొగుడు కన్నులను.

సుశీల. దెల్వి ♦ తెఱవకున్నె. 55

విమల. సీమంతినీ; సర్వభూతోపకారియగు కర్మసాక్షిని శత్రువర్గం బైన తిమిరౌఘంబు వెన్నంటి బాధించెడుఁ గంటివే.

మ. తమ మెల్ల న్వదిలించి ప్రాణితతి ని♦ద్రాముద్రనుం దెంచియు
త్తమములన్ స్నానజపాది నిత్యవిధులన్♦దై వారం బ్రేరించి చ
క్రము రక్షించిన కర్మసాక్షి యకటా♦కాలంబు రాంబోయెడున్
దిమిరం బాఘను వెంట నంటుచును బా♦ధింపన్ మొదల్వెట్టెడున్.
సకియా, చీఁకటిపడును మనము వెడలుదము, రమ్ము.

సీమంతి. ఏదీ మనకలవాణి.

విమల. ఏమి చిత్రమే యిది, ఆ పురుషుం డెవం డయినది కని వచ్చెద మీరు వెడలుం డన్ని తెలిపి పోలేదా?

సీమంతి. విమలా, ఆ కలవాణి కీ యధికప్రసంగము లేల? అటు పోయి పల్కరించుట చులకనగాదా! అతఁడే మెన్నునో? ఈకలవాణి యచట నెంతటి యనుచిత వాదంబులు జరుపునో? ఏమి గ్రహచారం బిది.

విమల. సకియా, వెఱవకు. మన కలవాణి మంచి నేరవరి. నీకుఁ జులకందన మెపుడ యినను దేనోపునా? ఇప్పుడే వచ్చిమనలఁగలయును. మనము వెడలుదము, రమ్ము (అనుచునిష్క్రమింతురు).

(చంద్రాంగద యుగంధరులు ప్రవేశించు)

యుగం. చంద్రాంగదా, కంటివే, నినుం జూచి నంతటి నుండి యా కాంత పడుకలఁత, నీకు నన్ని విషయంబులం దగిన కాంత యీప్రపంచంబునంగల బ్రహ్మసృష్టిలో నున్నది యా యని యెన్నుచుంటిని. ఇపుడుగదా నా మనంబున కించుక యూఱటఁ గలిగె.

చంద్రాం. మిత్రమా, ఆ సకియ నన్ను వివాహంబగు నను టేమి? ప్రపంచంబున నెందఱు రాకొమారులు లేరు?

యుగం. చంద్రాంగదా, రాజీవమునకు నెంత యలవడని దయినను భృంగశాబక ము మ్మెత్తకుం జనునా? ఏల యీ విచారము?

(కలవాణి ప్రవేశించును)

కలవాణి. (యుగంధరునిం గని) అయ్యా, మీ రే దేశపు వారలు? ఏమికార్యార్థముగ నీయు ద్యాన వనంబుఁ జేరితిరి?

యుగం. అమ్మా మాది నిషధపురి. ఇంద్రద్యుమ్నుని వరసుతుం డీ చంద్రాంగదుండు. అత ని సఖుండ నేను. వేఁటకై యడవిం జేరి యొక కురంగము వెంబడించి యీ

వనంబుఁ జేరితిమి. అమ్మా, నీ వెవరు ? ఇంతదనుక మిమ్ముఁగూడి విహరించుచుండిన స్త్రీరత్నం బెవరు ? తెలిపెదవా ?

కలవాణి. అయ్యా, ఆ కన్యారత్నం బీ పురి నేలు చిత్రవర్మని ముద్దుకూఁతురు. పేరు సీమంతిని. అయ్యా, సాయంకాలమైనది. మీ రీరాజకుమారునిం గూడి మాపురికి వచ్చి మారాజుగారిని సందర్శించి సంతోషించెదరా! సత్సాంగత్యము చందసహిమాంబు సంయోగ సదృశముగదా !

యాయుగం. (చంద్రాంగదునిఁజూచి) మిత్రమా, నీకదిసమ్మతమా? మనసైన్య మచట నినుఁగానక చీకాకుపడుచుండును.

చంద్రాం. మిత్రమా, మహనీయుల దర్శనంబుసేయఁదగినదియే కాని యిది సమయంబుగాదు.

కలవాణి. అయ్యా, అటులయిన నేఁ బోయివచ్చెద (అనుచు వెడలును)

యాయుగం. చంద్రాంగదా, కంటివే, నీ వెవరయినది తెలియుటకు నిచ్చెలువ వచ్చినది. నీ యిష్టార్థంబు సిద్ధించిన దని యెంచుము. మన మిచట నిఁక జాగు సేయరాదు. వెడలుదము రమ్ము.

(నిష్క్రమింతురు)

## తృతీయాంకము - తృతీయరంగము - రాజమందిరము.

చిత్రవర్మ, చిత్రరేఖ (కళావతి దాసి),

చిత్రవర్మ. దేవీ, మనగారాబుపట్టి యిపు డేరీతి నున్నది. ఇచటి కేల రాకయున్నది.

చిత్రరేఖ. ఆర్యపుత్రా, అస్వస్థతయే కారణంబు, అది యెట్టివ్యామోహమోగాని పలికినం జంద్రాంగదుని పలుకులే. మీ రిటు జాగుసేయుచుంట తగదు,

చిత్రవర్మ. దేవీ. ఆ కన్యావివాహం బన్న నా కెన్నరాని దుఃఖంబు వచ్చుచున్నయది. సుతాజాతకంబు పరిక్షింప విప్రోత్తముల కేల యిచ్చితినో?

చ. ఉదరమున న్గరంబు నిడి ♦ యూఁపి కలంచిన రీతి నయ్యోడిక
జెదరెడుగుండె యంగ మహ ♦ చిచ్చునఁ బడ్డటు తప్తమయ్యె నా
కదరెడు దేహమెల్ల నిపు ♦ డక్కట నిక్కముగా భవిష్యదా
పదలు మనంబున న్దవిలెఁ ♦ బ్రాణసతీ గతి యెట్టులోగదే. 57

(అనుచుఁ దలపోయుచుండును).

చిత్రరేఖ. ప్రాణేశా.

క. జాతకఫలమును నమ్ముచు। నాతతదుఃఖంబు దవుల నవునే మీరీ
రీతిని సగమగుట? యయో।ధాతలిపికి వేఱుదలఁపఁ దగునే? నాథా॥

ప్రాణపతీ, దుఃఖం బాసన్నంబయిన తఱి దాని సరకుసేయమి పురుషకారం బుగా నుండ నది రాకమున్నే వచ్చునని సగమగుట యనర్థంబు, దైవమ్మును నమ్మి శుభం బొనగూర్చినచోఁ బ్రాప్త్యనుసారం బగు.

చిత్రవర్మ. దేవీ, నీ యిష్టానుసారంబుగ గార్యం బొనర్చెద. ఇపుడే లగ్నపత్రికను వ్రాయించి నామిత్రుఁడగు నింద్రద్యుమ్నుని సరసకు నంపి వారము దినములలో వివాహమహోత్సవంబుఁ జరిపెద. మిగత కార్యంబునకు దైవంబుపై భారముంచెద.

చిత్రరేఖ. సంతసంబయ్యె, ఇపుడే నేఁబోయి సీమంతినికి నీ యుదంతంబు దెలిపి యూఱడించెద (పోయివచ్చెద)

చిత్రవర్మ. ఈ రాత్రియే మంత్రిని రావించి నిషధమం బంపి లగ్నపత్రిక మొదలగు వివాహోత్సవములు జరుప నాజ్ఞాపించెద.

(నిష్క్రమింతురు.)

తృతీయాంకము - చతుర్థరంగము.

బ్రాహ్మణులు, సాంబశాస్త్రి, నారాయణావధానులు, సుబ్బాజోస్యులు, పడిగంభట్లు.



సాంబ. అవధానులు, ఎంతటిమహోత్సవమయా, పెండ్లిమహోత్సవమిది.

అవధా. శాస్త్రులూ, ఉత్సవమేమయా, తిండి యెంత దండిగా జరిగినదయా!

జోస్య. ఏమయామీరు, ఉత్సవము తిండి మీద నున్నారు మనము మెచ్చఁ దగినది దక్షిణ విషయమయా?

భట్లు. ఆ విషయమునకు మనమూటలే సాక్ష్యములుగా నున్నవి. దుడ్డుపైఁ గొండంత యాశ యున్నయదిగాని దానిభారము మోయు శక్తిలేదయా ?

జోస్య. కాదు, అవధానులూ ? మన మా తిండి తిని పొట్టబరువు చేసికొంటిమి. కావున దుడ్డిఁకఁగొంచము హెచ్చుగా మూట కట్టలేకపోతిమి.

అవధా. అవునయా, అదినిజము. తిండి ముందుంచికొని యితరాలోచన లెవరు సేయుగురయ్యా!

శాస్త్రి. అయ్యలారా ? మనకు శక్తిచాలక యుంటకుఁ గతం బదికాదు. చిన్ననాటి నుండి పేగులు దిగునటుల చదువుచున్నవారికి శక్తివచ్చు టెటులయ్యా?

భట్లు. చదివినవారికి మీకుఁ బేగులు దెగినవి. ఆ కారణంబున శక్తిచాలక యున్న యది. నిరక్షరకుక్షినగు నాకేల సామర్థ్యములేదయా? ఎనిమిదిదినములు రేయుం బవళులు పిండివంటలు వండి తినఁబెట్టి యిపుడు దక్షిణమాటలు మోయుమన్న నెటు లగునయా ? శక్తిలేక యుంటకు తిండియే కారణంబు.

శాస్త్రి. అయ్యా, భట్లూ ! నీబోటి నిరక్షరకుక్షులకు సైతము లక్షలకొలఁది ధన మిచ్చిరి గదా, పరిక్ష సేయలేదా ?

భట్లు. చేసిరండీ. " స్వజాతివైరిచత్వారి '' యనులాగున మనకులము హీఁనట యొకఁ డు నేరి యందఱిని పొడిచి పేర్లుపెట్టుటకుఁ గంకణము గట్టికొని యుండెనే? ఆకుంకం భట్లు నాకేమి రాదని తెలిసియున్నను నన్నవమానింపఁ దలంచి నీకేమి వచ్చునని రాజుసమ్ముఖమ్మున నన్నడిగెను. నాకేమి వచ్చునండీ, పదునాల్గవయేట పెండ్లాముతో సంసారము సేయఁబూనిన నాకుఁ జదువెటు వచ్చునండీ.

శాస్త్రి. నీ వేమి బదు లిడితివి మఱి ?

భట్లు. మాటలువచ్చును, తిండితినుటకువచ్చును. నిద్రవచ్చును. కోపమువచ్చునని వెంట నే చెప్పితినండీ: చిత్రవర్మమహాప్రభు పక్కన నవ్వి బాగుగాఁ బరిక్షయిచ్చితిరి. వలసినంత ధనముఁ గొనిపొండని ధనరాశిఁ జూపెనండీ మహాప్రభువతఁడు.

శాస్త్రిలు. బాగుగాఁ బరిక్ష యిచ్చితివయ్యా,

భట్లు. అంతకాకయేమండీ; అందఱును జదువుకొన్నవారే ప్రపంచంబులో నుందురండీ. చదువుకోనివారు కూటికి, శాటకి, బోటకి లేక కాటకిఁ బోవలెనేమండీ;

శాస్త్రిలు. ఏమి లేకున్నను మాటలు నేర్చితివి కావుననే మర్యాదగలిగినది.

భట్లు. ఏదో యొకటి తిండికిమార్గము లేకున్న యెటులనండీ;

శాస్త్రిలు. మంచిపెండ్లయా యిది. పుష్కలధనము కొరికెను, ముందు ముత్తరముల నాసం తతికి జేష్టాదేవీభయంబు లేదు చిత్రవర్మమహాప్రభువు శాశ్వతమైన పుణ్యం మార్జించెను.

అవధాను. ఎంతటి చక్కని పరుఁడయా ఆ చంద్రాంగదుఁడు. ఆరాజకుమారునకుఁ దగిన కన్య కదా మన సీమంతిని. ఈడుజోడైన చెలిమిగదా నేత్రానందంబుగ నున్నది రూప శీల గుణ ధన సమానదాంపత్యంబు దైవసంకల్పంబు.

శాస్త్రిలు. ఆ వధూవరులు చిరాయురు పేతులై సౌభాగ్యంబున మని యుందురని నాకోరిక

భట్లు. మీ కోరిక యెవరడుగుదు రండీ; ఆ సీమంతినీమాంగల్యస్థిరతనుగుఱించి యేమే మో గుసగుసలు జరుగుచుండెనండీ, వింటిని.

శాస్త్రిలు. ఏమయా యది. ఏమి పిడుగువంటి మాటలాడెదవు ?

భట్లు కాదండీ, ఆ సీమంతినికి నింతలో వైధవ్యప్రాప్తియని సిద్ధాంతి యొకఁడు నిర్ధారించెనఁట.

శాస్త్రిలు. అయ్యో, పాపము. బంగరువంటి పిల్ల. అయ్యో గ్రహచారమా.

భట్లు. ఎవరికి గ్రహచారమండీ, ద్రవ్యము మనకోరిక. శుభమయిన నేమి? యశుభమైన నేమి? పైనపైన నిట్టివి తటస్థించినగదా మనబ్రతుకు తెల్లవారుచునది. అటుగాక మనకు రాజ్యమా మాన్యమా. రాజ్యము పూజ్యము, మాన్యము శూన్యము. ఇట్టివి లేనియెడల బ్రతుక కెటులండీ !

శాస్త్రిలు. అయ్యా భట్లు. ఇంకను వెయ్యి శుభకర్మలు గానిమ్ము. అశుభ మొక్కటయినను వలదు.

భట్లు. అంతయు మనము కోరినట్లే. చాలు. ఎండవేడిమి తగ్గినది. మాటలుమాని కొనుడి. పోయి పురింజేరుదము.

(నిష్క్రమింతురు)

## తృతీయాంకము - పంచమరంగము.

చంద్రాంగదుఁడు - యుగంధరుఁడు - వీరసేనుఁడు.

చంద్రాం. యుగంధరా, నిన్నటితో వివాహామహోత్సవసంభ్రమంబు సంపూర్తియయ్యె. నేఁ డిచట వృథాకాలక్షేపంబు సేయుచుండ నేల? ఎచ్చటికైనం బోయి హాయిగా విహరించి వత్తము.

యుగం. మిత్రమా, మరల వేటకుఁ బోయి మఱియొక యుపవనంబుఁ జొఱ నెంచితివా

చంద్రా. (నవ్వి) కాదుసఖా, వేఁటకాదు. ఉపవనంబుఁ బ్రవేశించుట కాదు.

మ. యమునాతోయమునం దుపాయమున నుద్యత్ప్రీతిఁ గ్రీడించి సా
యమునం జల్లఁగ నిల్లుఁ జేర మనమం దాపేక్ష కల్గె న్సఖా

యుగం. రమణీయంబగు మిత్రమా వనవిహా రం బైన నుత్తుంగభం
గములన్ వాహిని యుక్కి నిక్కెడిఁ జనంగా దిత్తఱి న్వేఁడెదన్

చంద్రా. యుగంధరా, వీక్షణీయవస్తువిశేషంబుల క్రాలవాలంబులు గదా వాహినీతీరంబులు. ప్రవాహరభసంబునకు మనము చిక్కక తీరము సరస నేఁపడవపై సంచరించి సూర్యుండస్తంగంకక మున్న గృహము సేరుదము.

వీరసేనుఁడు. చంద్రాంగదా, ప్రవాహభయము మనకు వలదు.

ఆ. వె. భయము వలదు మనకుఁ ♦ బటుశక్తిమంతులు
నారకూటు లుందు ♦ రయ్యయిచట
తెప్పపాటులోన ♦ నొప్పంగ దింతురు
తెప్పవదల రెంత ♦ ముప్పొదవిన.

చంద్రా. మిత్రులారా, ఈప్రవాహమున విహరింప భయమేమి! రండి పోవుదము.

(అనుచు నిష్క్రమింతురు.)



శ్రీ

# సీమంతినీ నాటకము.

## చతుర్థాంకము - ప్రథమరంగము. యమునానది.

చంద్రాంగదుఁడు, యుగంధరుఁడు, వీరసేనుఁడు, పడవవారు.

పడవవారు పాట హిందూస్థాని-ఏకతాళము.

మా సరివారిని గానము । నడపర యింక నుడుపము
గడియకునామడపోదుము । ఒడయని మెప్పునందుదము ॥ ౧॥
ఏరిసయలలనెక్కుదము । జారుచుదూరముపోవుదము ॥ ౨॥
గాలికివానకువెఱవము । ఏలినవానిమఱవము ॥ 3॥

యుగం. చంద్రాంగదా! నౌకావిహారంబునఁ గాలజ్ఞానంబు లేక దూరంబు వచ్చితిమి సాయాహ్నమాయెను. అదిగో పశ్చిమదిశాగతుఁడైన సూర్యునిం గనుము.

మ. చరమాబ్ధిన్ బడఁబేతుఁడౌ ప్తి మిహిరా♦శ్వమ్ముల్ ద్వర న్బోవఁగా
ఖురసంఘట్టనజాతధాతుకణసం♦క్షోభన్ భరిమన్జెంది భా
స్కరుఁ డద్రింబడె రక్తగాత్రుఁడయి తే♦జంబేది వీక్షింపుమా
యరివర్గంబు తమస్సు చుట్టికొని హా♦హా యబ్ధిలో ముంచెడిన్.

చంద్రాం. మిత్రమా! నిజము ఈసఖినినిగను.

క. అపరాశా రక్తుండగు
తపనునిఁ గని నళిని క్రోలెఁ♦ దమమను విషమున్
వ్యపగతజీవన కాదయొ
విపరీతమె విషము నెందు♦ విషజాతలకున్.



వీరసే. చంద్రాంగదా! నభంబు భంబులచే నిండుచున్నయది కంటివే.

చంద్రా. వీరసేనా! అవి నక్షత్రములుగావు.

తే. చరమగిరి నాట్య మాడెడి ♦ సురతరుణుల
హారములు తెగి జలధిలో ♦ నంతరింప
నవిని రత్నానిఁ గట్టి త ♦ ద్రమణు లబ్ధి
మునిచి యెత్తెఁ యవియెపో ♦ ముత్తియములు. 64

సహచరి. అయ్యోలారా! గాలి మెండయ్యె. కేలుసాలెడిని బదరము బదరము (అనుచుం దెఁ దెప్పమునఁగును)

—— చతుర్థాంకము - ద్వితీయరంగము. ——

సీమంతిని, చిత్రరేఖ, చిత్రవర్మ.

సీమంతిని.

ఉ. హా జగదేకమోహన, శ్రీ ♦ తావన, పావన, సాధుజీవనా,
ఆజముఁ డాఁగి యాఁకటిని ♦ నాకట నీదగు పెంపు మిగ్రింగెనే
నీ జవసత్వసంపదలు ♦ ని న్నెడఁబాసెనె, నీవె నీఁగితే
రాజకులాభిరామ యెటు ♦ రాపడి పోయితో నేఁడు నీటిలోన. 65

ప్రాణనాథా, పాపభూయిష్ఠంబైన భువినిఁ బుణ్యమూర్తు లుండఁ దగ దని జీవన మిషంబున జీవంబు విడిచితివే.

క. అలనాఁ డా యుపవనమున
నలినీలాలకలఁ గూడి ♦ యాడెడి వేళన్
వలచేనిఁ బోలు నినుఁ గని
వలఁచి వరించినది యెల్ల ♦ వమ్మై పోయెన్. 66

అకటకటా, పెరుగుట విఱుగుట కను నది నిజంబయ్యె. నిన్నకదా ముదబ్ధిని మునిఁగి మునిఁగి తేలి తేలి యోలలాడితి. నేఁడు గదా వైధవ్యదుఃఖం బను మున్ను రాగ్నింబడి తపించుచున్నది. హా; దురదృష్టమా!

తే. ధాత హృదయంబు దలఁపఁగా ♦ ఱాతఁ జేసి
నట్టిదియొ గాక నే నట్టి ♦ యపకృతంబు
చేసితినొ మున్ను నాపైనఁ ♦ జెఱుపుఁదలఁచి
చెఱిచె నన్నిటుఁ వెతకాదె ♦ జీవనమికఁ. 67

హా; శరీరము దుర్భరము, దుస్సహము, అవనిని మనం గలిగిన మనికి లేని యునికి యొక యునికియా ?

చిత్రవర్మ, తల్లీ, సీమంతినీ, దుఃఖింపకు, ఊఱడిలుము.

సీ. వగవకు నందనా ♦ వచ్చు శుభాశుభ
ముల నెవ్వరికి నైనఁ ♦ దెలియ వశమె
కాలానుగుణముగఁ ♦ గలిగెడు నెవ్వగ
మాన్పఁగ వచ్చునే ♦ మనుజతతికి
మహిని మర్త్యులు సేయు ♦ మహిత యత్నంబులు
దైవానుకూలతఁ ♦ దగఫలించుఁ
గలుగుఁబురాకృత♦కర్మానుసారంబు
మనుజులకనుమతి♦వినవెతల్లి.

తే. గీ. శైశవంబున నీ దగు ♦ జాతకంబు
గనిన విప్రుఁడు నీ కిట్టి ♦ వనట కలుగు
ననుచుఁ బలికిన పలుకులు ♦ వినక యిటులఁ
గూర్చితిని నీకు దుఃఖంబు ♦ గూర్మితనయ. 68

చిత్రరేఖ. సీమంతినీ, దుఃఖించినం బ్రయోజనం బేమి, వలదు వలదు.

సీమంతిని, తల్లీ, ఏమి యున్నదని యూఱడిల్లుదునే ?

చ. మదినిఁ గుదిర్చి యింగలఁపు ♦ మంటలబాధ సహింపవచ్చుఁ బో
పమనగు సూదిపోటులకుఁ ♦ బ్రాణము గట్టిగ నిల్పవచ్చు, నె
మ్మదిగను గాలకూటమును ♦ మక్కువఁ గ్రోలఁగవచ్చుఁ దల్లి రో
వదలక ప్రాణముల్ నిలుప♦వచ్చునెయీ విధహాత్వ మొందియున్.

అసహ్యమ్మసహ్యము, ప్రాణత్యాగమే శ్రేయము.

సీ. కనిగుఱ్ఱిడ్డి వినిచెవు ♦ డనురీతి నటియింప
ననుభవ మయ్యె నా ♦ కవిధి యిటుల

చిక్కుకలేక యా ♦ సిద్ధాంతి యాడిన
వసటవార్తలు విని ♦ వగలఁ బూని
ఆ మహామహుఁ గోరి ♦ యాఱడి పాలైతి
దైవికం బిది తప్పఁ ♦ దరమె నాకు
యొందిలియై యిట్టి ♦ యొచ్చెపుబ్రతుకు నా
కోడఁబసు నెటులయో ♦ యొడలు విడుతు.

చిత్రకే. తే. వలదు నందన నీ విట్టి ♦ వంతఁగుంద
బూర్వకృతకర్మ కనుగుణ ♦ ముర్విఫలము
లగుఁ గదమ్మ పునీతవు ♦ దగునె నీకుఁ
బాపకర్మంబుఁ దలపోయ ♦ బాల యిటుల. 70

తల్లీ సీమంతినీ, వయసునఁ జిన్నదాన వైనను బుద్ధిని గొప్పదానవని పేరొందిన నీ విటు బలాత్కారప్రాణత్యాగంబునకు నమకట్టుట దగునా? వల దీసాహసము. దుఃఖింపకు, సర్వము నా యుమామహేశ్వరుల యధీనంబని నమ్మి యూఱడిలుము.

సీమంతిని. (తలవంచికొని యించుక యోజించి) తల్లీ, "అనాథో దైవరక్షక" యను రీతి నా కారీశులకు ననవరతారాధనాధీన నగుట తప్ప నితరశరణంబు లేదుగదా. అటులనే కానిమ్ము. (తండ్రివంకఁ గని) తండ్రీ, నా కీగృహంబు వలదు, యమునాతీరస్థ పార్వతీపరమేశ్వరాలయంబునం దహోరాత్రంబుగ నివసించెద. అనుజ్ఞ యిండు.

చిత్రవర్మ. తల్లీ, నీయుద్యమం బతిశ్లాఘ్యంబు. అవశ్యాచరణీయంబు అయినను ముంగిలెఱుంగని ముద్దురాలవు నీ వెట్టు లట్టి యిక్కట్టుల కోర్తువో యని చింతించెద. నీ దుఃఖోపశమనంబున కిదియే సదుపాయంబని సమ్మతించెద మంచిది,

సీమంతిని. జననీజనకులారా, నేనిపుడే యాపురాణ దంపతుల యాలయముఁ జేరం బోయెద.

(నిష్క్రమింతురు.)

## చతుర్థాంకము - తృతీయరంగము.

రసాతలము, తక్షకునిసభామందిరము.

తక్షకుఁడు. నాగకన్యకలు. చంద్రాంగదుఁడు, దూత. మఱికొందఱు.



దూత. తక్షక నాగేంద్రా, కొందఱు నాగకన్యకలు వచ్చి తమదర్శనార్థముగ వేచియున్నారు.

తక్ష. రానిమ్ము.

(దూతనిష్క్రమించును - నాగకన్యకలు ప్రవేశింతురు)

నాగకన్య. నాగేంద్రా, అభివందనంబు లాచరింతుము.

తక్ష. మీకు శుభమగుఁ గాత. రమణీమణులారా మీ వచ్చుటకుఁ గారణంబేమి?

నాగకన్య. తక్షకస్వామీ, తమ కొక పురుషరత్నమును గానుకియ్య వచ్చితిమి

తక్ష. ఏ పురుషరత్నమును.

(నాగకన్యకలు చంద్రాంగదుని, తక్షకుని సమక్షమున నిలుపుదురు. చంద్రాంగదుఁడు నతు లొనరించును)

తక్ష. జవ్వనులారా, ఈ యౌవ్వనపురుషుని మీ రెటు దెచ్చితిరి?

నాగ. ఉ. పన్నగచంద్రిమా యమునఁ • బాటలగంధులఁగూడి క్రీడలన్
జెన్నలరారుచుండ నొక • చిత్రపుశబ్దము వీనులం బడన్
గ్రిన్ననఁ బోయి, యా దిశను • గంటిమి యీ యసమానతేజునిన్
గొన్ననవింటివాని నగు • రూపరి భూపతిపుత్రుఁబాత్రునిన్. 71

అహికులేంద్రా, అటు లీపురుషునిం గని తెచ్చి మా గృహము నందుఁ బెంచితిమి. ఈ పురుషుని సుగుణసంపత్తికి మెచ్చి తమ సమ్ముఖమ్మున నిట్టి పురుషరత్నం బుంట మేలని యిటు తెచ్చితిమి.

తక్ష. (చంద్రాంగదునింజూచి) పురుషవరా, నీవెవ్వాఁడవు ?

చంద్రా. ఉ. ఏ జనపాలుఁ డా భువిని • నేలిన కాలము నందు దిక్కరుల్
రాజిలి దారపుత్రసుఖ • రాజినిఁ గాంచి పరుండె హాయిగా
భూజను లేమహీవరునిఁ • బూజ్యునిఁగా మదినెంతు రట్టి వి
భ్రాజితపుణ్యుఁడౌ నలుని • పౌత్రుఁడ నాగవరేణ్య వింటివే.

కుంతలేంద్రా. నిషధరాజ్యంబు నేలుచు మాస్ప్రాణాంతకమైన బాధలచేఁ జిక్కి నను సత్యసంధుఁడని నిత్యకీర్తిఁ గనిన నలచక్రవర్తికి మనుమఁడను; భోగజితసురేంద్రుండయినను జితేంద్రియుండని ఖ్యాతిఁ గనిన యింద్రసేనుని పుత్రుఁడను చంద్రాంగదుఁడని నను నందురు.

తక్షకుఁడు. (సంతసంబునఁ దలయూఁచి) రాజకుమారా నీ వీ నాగకన్యకల కెటు చిక్కితివి

చంద్రా. చ. అహివర చిత్రవర్మనకు ♦ నల్లుఁడనై యమునాహ్రదంబునన్
రహిని విహారముల్ సలుప ♦ రక్కెను వేడుక సార్థకంబుగా
విహితులఁ గూడి నావపయి ♦ వింతగ నాడుచు నుండ నంతలో
నహితసమీరముల్ విసరె ♦ నక్కటపోతము గ్రుంగె నీటిలోన్.

నాగకులవరేణ్యా! అట్టి తఱి రాపడి నే మునుంగుచుండ నా పాలి దైవతంబులరీతి నీ యువతులు నను బట్టి ప్రాణంబు నిల్పి తెచ్చిరి. తమబోటి మహానుభావుల సందర్శనంబున కిది కారణంబయ్యె. "కీడుఁగని మేలుగను" అనుప్రవాదంబు సార్థకంబయ్యె. ధన్యుండనైతి.

తక్షకుఁడు. రాకుమారా! ముప్పదిమూఁడుకోట్ల దేవాళిలో నీవు మానసిక, వాచిక, కాయిక శుద్ధిఁగలిగి యే దేవునిం బూజింతువు. నీ కే దేవుండు రక్షకుఁడై యుండు.

చంద్రా. (చంపకమాలిక.)
శతధృతిచక్రిపాణులును ♦ శక్రముఖామరయక్షరాక్షసుల్
వ్రతనిరతుల్ యతు ల్పురుష♦వర్యులు మాన్యులు దీనమానవుల్
సతమని యే మహామహుని ♦ శాంతియు దాంతియుఁ గల్గి భక్తిచే
స్తుతి యొనరింతు రెల్లపుడు ♦ స్తుత్యుఁడెతండు జగంబు లెల్ల ర
క్షితముగఁ గుక్షి నుంచుకొని ♦ శ్రేయము లిచ్చును, సృష్టినాశన
స్థితిగతు లేమహాపురుషు ♦ చేతను లోనగు, నే మహాత్ముఁ డా
తతభవదుఃఖహర్త సత ♦ తమ్మును నెవ్వఁడు లోకభర్త సం
చితకలుషౌఘనాశకుఁ డ ♦ చింత్యుఁ డెవండు కృశానుచంద్రమా
రుతరవు లాదిగాఁ గలుగు ♦ రూపము లెన్నిదిఁ గూడి యొక్కఁడై
సతతము సర్వలోకములఁ ♦ జల్లఁగఁ జూచును నెవ్వఁడా నిశా

పతిరవిహేతులన్ నయన♦భావులఁ జేసె నెవండు మృత్యుదే
వతకును మృత్యువై వెలసి♦భక్తులఁ బ్రోచు నెవండు రక్తిమై
హితులను దక్షకాదుల న♦హీంద్రుల సొమ్ములఁగాఁగ నెమ్మెయిన్
జతనముగన్ ధరించి విల♦సద్గిరిరాజితుఁ డయ్యె నెవ్వఁడా
సతిపతి శర్వుఁ డీశ్వరుఁడు♦శంకరుఁ డవ్యయుఁ డప్రమేయుఁడా
రతిపతివైరి పూజ్యుఁ డయి♦రక్షకుఁడై ననుఁ గాచు నిత్యమున్.

తక్షం. (తక్షకుఁడుఁ లేచి చంద్రాంగదు నిఁ గౌఁగలించికొని) రాజకుమారా. అస్మత్కులదేవతాస్తుతి యింతయొప్పునే యని విస్మయమానచేతస్కుఁడ నైతి. నీ కభయదానం బిచ్చితి. సకలసామ్రాజ్యంబు లనుభవించుచు నా పురి నుండుము. నీకేకొఱఁతయుఁ గలుగదు.

చంద్రా. తక్షకనాగేంద్రా! నీ మన్నన యింతయొప్పునే, నీ సత్కృతివచనంబులు నా కమితానందంబుం గలిగించె, అయిన నొకవిన్నపం బొనర్చెద. నా మనం బనూన వ్యసనాయత్తమై యున్నయది.

ఉ. అక్కడఁ దల్లిదండ్రు లక♦టా మదిఁ గుందుచు నెంత స్రుక్కిరో
యిక్కడ నత్తమామలు సు♦హృద్వరులున్ మది నెంత పొక్కిరో
నిక్కఁపు మోహము న్గలుగు♦నీరజలోచన నాదు దార తాఁ
జిక్కెను మిక్కుటంపు వెతఁ జిచ్చునఁ జొచ్చెను తోఁప దేమియున్.

(అనుచుఁ జింతించుచుండును.)

తక్ష. చంద్రాంగదా! సకారణంబైన నీ దుఃఖోదంతంబు నాకతిచింతాకరంబుగా నున్నయది. నీ విందుంట ధర్మంబుగాదు, క్షిప్రంబుగఁ బురిఁ జేరుము. ఇదిగో యీ యరి వినాశకరమ్మగు శతారమ్ము గొమ్ము. ఈ యమూల్యాభరణమ్ముల చేనలంకృతుఁడవు గమ్ము. నా సుతుఁడు సత్యవంతుఁడు నినుం బురిఁజేర్చి మరలి వచ్చును.

చంద్రా. కుండలీంద్రా! మహాత్ములు నిర్వ్యాజబంధులనునదినీచే నేఁడు సార్థకతఁ జెందె. నీ సత్కారంబు సదా సంస్మరించెద. సెలవిచ్చినఁ బోయి వచ్చెద.

తక్ష. రాజకుమారా! నీకుఁ గుశలమగుఁగాత, నీవు ప్రయాణసిద్ధుఁడ వగు నంతలో సత్యవంతుఁడు నినుఁ జేరును. మంచిది పోయిరమ్ము.

నాగకన్యకలారా! మీరు శ్రేయస్కరంబైన పని యొనర్చితిరి, మీకు శుభమగుఁ గాత, పోయిరండు.

(నిష్క్రమింతురు.)

చతుర్థాంకము-చతుర్థరంగము. ఉమామహేశ్వరుల దేవాలయము.

సీమంతిని. యోగిని, చంద్రాంగదుఁడు, సత్యసంతుఁడు.

సీమంతిని పాట.

హిందూస్థానీగీతము - ముఖారిరాగము - ఆదితాళము.

ఏలవేనన్ను । నీశానీ । వేలవేనన్ను । నీశానీ॥
నన్నేలవేనన్ను । నీశానీ॥ పల్లవి ॥

1. ఈయవే-శివనా-నాయకునీవే । నీవే-లేవే-రావే॥
ఈయవెనా-నాయకుతోన । న్నింపుగఁగూర్పవే। శర్వాణీ॥ ఏలవే॥
2. మనుపను-బెనుపను-జెఱుపను-నీవే। మాతవే-మహనీయవే॥
జననియు జనకుండవు నీవే యని।సమ్మతి-నమ్మితినే-భవానీ॥ ఏలవే॥
3. పతినింబాసి-బ్రతుకఁగలేనే । పార్వతీ-పరమేశ్వరీ॥
అతనిది గతియే-యగుతన్నా గతి।యానతియీవే-రుద్రాణీ॥ఏలవే॥
4. శంకరార్థాంగీ-సౌఖ్యమునిడవే । బొంకమే-నినుఁగొల్వమే॥
శంకరి-కింకరి-సీమంతినినే! జల్పవె సార్థకఁగాఁ-గల్యాణీ॥ ఏలవే॥

(ధ్యానించుచుండును)

యోగిని. సీమంతినీ! నీవీ రీతి నష్టిగతప్రాణవై భూరితర పరివేదనాగ్నిఁ గ్రాగుచుంట సరి కాదు. గ్రహచారము సర్వజనసామాన్యము. కృతపడిన కార్యంబునకుం గుతిలపడు టేల! "చక్రవత్ పరివర్తంతే దుఃఖానిచ సుఖానిచ" యను నది వినవే? నీ పురాకృత పాపఫల మీరీతిఁ బరిణమించినది చింతింపకు.

సీమంతిని. యోగినీ! నీవచనమ్ము లతిహితమ్ములు. పురాకృతాఘశాంతికినై కదా యీ సర్వమంగళాన్విత సదాశివుని నే సదా భజించుచుండెద.

చం. స్థిర మగు భక్తియుక్తిని స • తీయుతు నీశ్వరుఁ జంద్రశేఖరున్
హరుని నితాంతపాపహరి • హారుని దీనభయాపహారునిన్

బురహరునిన్ సురాసురసు ♦ పూజితదివ్యశరీరునిన్ గురున్
బురుషవరు న్భజించెదను ♦ బూర్వభవార్జితపాపశాంతికై. 77

యోగిని. సీమంతినీ! అటులయిన నాహారాదులు వర్జించుటేల? ప్రాణంబుపై నింతటి తిరస్కృతియేల?

సీమం. యోగినీ!

చం. దయ దయివార నాదయితు ♦ దారినిఁ గానఁగ నబ్జధారినిన్
భయపరిహారునిన్ భువన ♦ భర్తను గంటకవర్గహర్తనున్
బ్రియహితకర్తనీశ్వరునిఁ ♦ బ్రీతుగఁ జేయఁగ మ్రొక్కి వేఁడుదున్
నియతిని నిండుడెందమున ♦ నిల్పుచు సల్పుదు బూజ లెప్పుడున్.

చం. మహీధరరాజు కూఁతురయి ♦ మానక చేసి తపంబు పెంపుగన్
మహిమ దలిర్ప మారజయ♦మాన్యుఁ బురారినిఁ గాలకాలునిన్
విహితముగాఁగఁ బెండ్లియయి ♦ పెన్మిటి కర్ధశరీరమయ్యె నే
మహిత దదీశ్వరిన్ భువన ♦ మాతను గొల్తు నభీష్టసిద్ధికిన్. 79

యోగినీ! ఈ పురాణదంపతులు ప్రాకృతకర్మచ్ఛేదనకారులు. కావున నా పాపంబు హరించి నా ప్రాణనాథు దారిం జూపి నను రక్షింతురని యెద నమ్మి వారి సన్నిధినిఁ బ్రాణంబుఁ ద్యజింప సుద్యమించితిని. (అనుచు నుమామహేశ్వరుల దిక్కుం జూచి)

ఉ. భావమునం దనారతము ♦ భర్తయె భాగ్యముగాను నమ్మి నే
నేవిధి యీవిధిన్ బ్రతుక ♦ నెంతును చాలును జాలు భారమీ
జీవము నుంప నోప నెటు ♦ సేయుదునో గిరిజామనోహరా
కావ నశక్యమేని ననుఁ ♦ గాంతుని చెంతకుఁ బంపవే వెసన్. 80

సీ. కన్నులవిలుకాని ♦ చెన్నేదఁ జేసిన
కనుబాటు కడిమెటు ♦ చనెను శూలి
కాలునికంఠంబుఁ ♦ గత్తరించిన నీదు
కరవాల మేమయ్యెఁ ♦ గరళకంఠ

కినలుచు జగమెల్లఁ ♦ గడికొను గరళంబు
గాచికంఠంబున ♦ దాఁచి తేల
ప్రళయకాలప్రకో ♦ పంబుఁ జూపు మటన్న
లేని యోపికయైనఁ ♦ బూనె దేమి.

తే-గీ. పుడమి పాపీచిరాయువ ♦ న్నుడినిసార్థ
కతను బొందింప నన్నిటు ♦ కనికరించు
మెల జీవంబు వలదు ప్రా ♦ ణేశు కడకుఁ
బంపి వేగ ముదబ్ధిని ♦ ముంపు దేవ. 81

(అనుచు నిమీలితనేత్రయై ధ్యానించుచుండును)

(చంద్రాంగదుఁడు సత్యవంతుఁడును ప్రవేశింతురు)

చంద్రా. మిత్రమా! చూచితివే! ఈ గిరీశాలయ గర్భమండపంబున నొక తరుణీమణి పార్వతీశ్వరారాధనాధీనచిత్తయై యాహారాదులు వర్జించి శరీరముఁ గృశింపఁ జేసియు సురూపంబున న్నానఁబెట్టిన మానిక మట్టు లొప్పుచున్నయది. వింటివే! తన పతిగతికిఁ దన్నుఁ జేర్పు మని దీనాలాపంబుల వేఁడినది. ఈ చెలువ యెవతెగా నుండును. (అనుచుఁ జక్కగాఁ జూచి) మిత్రమా. ఈ హేమగాత్రి నాకు దృష్టపూర్వగా నున్నయది. ఈ చంద్రవదన ముఖంబు వీక్షించిన తడినుండి నా మనంబున నవాచికములగు తలంపు లెన్నియో తోఁచుచున్నయవి.

సీ. ఇందుకలాలిక ♦ సుందరతరఫాల
తల మేల యిటు గత ♦ తిలకమయ్యె
జూపుల నిసులేను ♦ సుదతిదృక్తతి యేల
యంజనత్యక్తత ♦ నమరియుండు
హాటకనిభగాత్రి ♦ పీటికథావర్జి
తాధరయై యున్న ♦ దకట యేమొ
కలకంఠకంఠి తాఁ ♦ గంఠసూత్రవిహీన
యగుటకుఁ గతమేమొ ♦ యరయ వలదె

గీ. అంగరాగాదు లెవియు శు♦భాంగి గనక
స్నానజపముల నవియుచు ♦ శంభుపూజ
సలుపుచుండెడి నేలొకో ♦ సతినిఁ జూడ
దృష్టపూర్వగ నున్నది ♦ తెలుఁగ దేమొ. 82

మిత్రమా. కత మేమియో గాని నా మనంబు కలఁచిన రీతి జీకాకయినది.

సత్యవం. ఆ కులాంగనాకారవికారతకు నీ మనోవ్యాకులతకు సంబంధ మేమి?

చంద్రాం. అది నాకును దెలియకున్నయది.

సత్యవం. అదిగో గర్భమండపమునుండి యా సఖి నఖికాఁబోలు వచ్చుచున్నయది. విచారింపుము.

(యోగిని ముఖమండపమునకు వచ్చును.)

చంద్రాం. అంబా నీవెవరు?

యోగిని. ఈ దేవాలయమున నుండు భక్తురాలను యోగినిని.

చంద్రాం. అంబా, గర్భమండపంబున చిత్రాసనాసీనయై శాంకరీశాంకరుల కైంకర్య మెడలని భక్తిని నిర్వహించు భక్తురాలెవరు?

యోగిని. అయ్యా, ఆ గరిత చరిత నుడువ వెతగా నున్నయది.

సీ. చిత్రవర్మని పుత్రి ♦ చెలువ సీమంతిని
యనుపేర బరఁగెడు ♦ ననఘచరిత
చంద్రాంగదుని దార ♦ సతి సుగుణోదార
దయితుఁడు యమునలో ♦ దైవగతిని
జెందిన దినమాది ♦ శివపూజ సలుపుచు
భోగభాగ్యత నిట్లు ♦ భువిని బ్రతుక
వేసరి గౌరీశు ♦ వేఁడు రేయుంబగల్
పంచత్వమును నయో ♦ పడుచు బ్రాయ

గీ. మునను నీరీతి దుఃఖంబు ♦ మూడి జీవ
మువగణన సేయుచుండును ♦ నహరహంబు

సకలసామ్రాజ్యమును జేయు ♦ సతికి వ్యర్థ
మయ్యె భర్తృవిహీనత - యక్కటా కటా. 83

(చంద్రాంగదుఁడు నిట్టూర్పులఁ గన్నీరు విడుచును)

అయ్యా, ఈ యింతి యుదంతంబు విన్నవారెల్లరు గన్నీరు గార్పక పోరు. హా. ఆ సుగుణఖని చంద్రాంగదుఁడు దైవగతిఁ బొందుట గదా యిందఱి కిన్ని విధము లయిన యిక్కట్టులు మూడెను. కటకటా, ఆ చంద్రాంగదుని తలిదండ్రులు చెఱఁజిక్కి హా పుత్రా యని వాపోవుచు నెట్టి దుర్గతికిం గుఱియైరో, అరులకుఁ గరుణ వుట్టునా!

చంద్రా. (నిట్టూర్పువిడిచి) అంబా, వారేల చెఱఁ జిక్కిరి.

యోగిని.

ఉ. పుత్రవియోగతప్తు లనఁ ♦ బుణ్యుని మాన్యుని నింద్రసేనునిన్
శత్రువు లక్షై చుట్టికొని ♦ సాహసవృత్తిని గారఁ జేర్చుచున్
గృత్రిమవృత్తి నాతని స ♦ తీమణినిన్ జెఱఁ బెట్టిరయ్యొ; హా!
పుత్ర! యటంచు నేమయిరొ ♦ పొక్కుచు వృద్ధులు దుఃఖ మక్కటా.

చంద్రా. (హా యని కన్నీరు నించి, ధైర్య మవలంబించి) అంబా, దుఃఖంబు వినఁజాల.

యోగిని. అయ్యా! నీవెవరు.

చంద్రా. (ఇంచుక యోచించి) అంబా, ఇందఱనీరీతి విపదబ్ధిలో ముంచిన పాపాత్ముని బ్రాణపదంబే నేను, యోగినీ, ఆ సతీమణితో నొక మాట వచింపఁ దలంచితి. అనుకూలావసరం బెద్ది.

యోగిని. అయ్యా, అర్చనావిధి పూర్ణంబయినది. ఇపుడే వచ్చును.

(సీమంతిని ప్రవేశించుచున్నది.)

చంద్రా. సతీమణీ, నీ యుదంతం బీ యింతిచే వింటిని. నీ కిఁక నెంజలికిం గారణంబు లేదు. నీ పురుషుం డాపురాణపురుషుల కరుణాతిరేకమ్మున సురక్షితముగ వసుంషం జేరి మని యున్నవాఁడు. ఇపుడే నిషధం జేరి జననీజనకులఁ గారాగృహ విముక్తులం జేయ యత్నించుచున్నవాఁడు.

సీమంతిని. (దీర్ఘాలోచనసేయుచు నిలుచును.)

—. సతీమణీ, ఆలోచన వలదు. నీప్రాణపతికిఁ బ్రాణపదం బేను, వేఱుగాదు.

మ. సతి నీ నాథుఁడు తక్షకాహింపు కృపన్ ♦ సాక్షాత్కరించె న్భువిన్
వితకోదీ నుడి నమ్ముమా యతఁడు నా ♦ విశ్వాసపాత్రుం డభి
న్నత మే మన్నిట నెల్లకాలములలో ♦ నన్గూడి వర్తింతు మీ
వెత లూన న్గతమేమి యింక నిను రా ♦ వించు న్బరి న్జేరఁగన్.

సతీమణీ, ఇది నీ పతియాజ్ఞప్తిగా నే నుడివితి. ఇఁక నిట నిలిచి మాటలాడ సమయంబుగాదు,

(అనుచుఁ జంద్రాంగదుఁడు సత్యవంతుఁడు నిష్క్రమింతురు.)

సీమం. యోగినీ, అకారణకారుణ్యం బెదఁ బూని నన్నూఱడించి పోయిన యీ మహానుభావుం డెవఁడయినది తెలియకున్నది. అది విమర్శింప నవకాశం బియ్యఁ డయ్యె. అతని ముఖభావంబు వీక్షించిన తఱి నుండి నా ప్రాణనాథునిఁ గన్నులారఁ గనినట్లున్నది. సల్లాపము సైత మొకభంగి నుండెను. ఏమనుందును?

క. మానస మొకతీరై యను
మానము బలమయ్యె నన్ను ♦ మానువియోగా
నూనతరతీవ్రవేదన
యూనెను హృదయంబు మరల ♦ నధికతమముగన్.

యోగినీ, యోజించి నట్లెల్ల ననుమానంబే బలంబగుచున్నయది.

చ. జలమున మున్గి పోవుతఱి ♦ శాంకరి న న్గృపఁ బ్రోవ నాథునిన్
వలకువఁ జేరి తీరమున ♦ వైచెను కాక జలాధిదేవతల్
వెలువడఁ జేసిరో క్రొ దయ ♦ వెల్లిగొనన్ ముఖభావ మెల్ల నా
వలపులతేనిమాడ్కిఁ జెలు ♦ వంబున నొప్పె ని దేమి చిత్రమో.

యోగినీ; పతివ్రతామణియయిన యామైత్రేయి యమోఘంబైన వచనఫలమ్ము ప్రాప్తించియుండునా, హా! హా! హతభాగ్యకు నాకేల యట్టి పుణ్యంబు ఘటిల్లు.

యోగిని. సీమంతినీ, భవితవ్యము శుభమనియే నా మనఃప్రవృత్తి తెలుపుచున్నయది. చింతింపకు.

సీమంతిని. నను రక్షించునది గౌరీశుల భారము. ప్రొద్దాయెను. ద్విజదంపతులు గాచి యుందురు. పోదము.

(అనుచు నిష్క్రమింతురు.)

## చతుర్థాంకము - పంచమరంగము.

చిత్రవర్మ. ఈశ్వరభట్టు, నారాయణభట్టు, మహదేవశాస్త్రిలు, మంత్రి.

చిత్రవర్మ. మంత్రీ, నేడు సీమంతినీ కృత బ్రాహ్మణారాధనమున కగిన సమగ్రసాహిత్యము సిద్ధపఱచితివా?

మంత్రి. రాజేంద్రా, సమక్షమున నేనుండి సిద్ధపఱచితిని.

చిత్రవర్మ. మంత్రీ, వ్యసనాగ్నిం గ్రాగి కంఠగతప్రాణయై లేవలేక యడుగిడఁగ జాలక యున్న సీమంతిని యిపుడు పది దినములుగా నించుక యూఱట కలిగి యున్నయది, కంటివే.

మంత్రి. రాజచంద్రమా, ఒక మహాత్ముండు సాక్షాత్కరించి "తక్షకుని కృపచేఁ జంద్రాంగదుండు భువిని బ్రతికి యున్నవాఁడు, అచిరకాలంబుననే పతి వియోగ దుఃఖంబు తత్ప్రాప్తిచే మానుసని" వచించెనఁట. ఈవృత్తాంతం బందుండు యోగినిచే వింటిని.

చిత్రవర్మ. (సంతోషమున) అహా, అంతటి భాగ్యమా?

నారా. అటులయిన నా జ్యోతిషగ్రంథంబు లన్నియుఁ బరశురామప్రీతిగాఁ గావా?

ఈశ్వర. అటుల కాదేని జగదంబను గుఱించిన నాదు తపంబు బూడిదెలోని హోమంబు గాదే!

నారా. నీ తపంబు నివుఱులో నేల్చిన హోమం బనుటకుఁ బ్రకృత స్థితియే ప్రమాణమై యున్నయది. ముంజేతి కంకణంబున కద్దంబేల, ఓరీ నిరక్షరకుక్షీ, ఇల్లలికిన మాత్రన పండుగగునా, తపం బొనర్చిన మాత్రన తపస్సిద్ధి కలుగునా? గారవేషంబున వచ్చిన సురవారవధూటిచే వంచితుఁడవై గర్వించి ప్రల్లదములు ప్రేలకు నిన్నుఁ బోలు మూర్ఖుఁడు "రామాయస్వస్తి రావణాయస్వస్తి" యని యనుచు దొంగను దేల్గుట్టిన నట్టు దాఁచికొని యుండిన మానము గాని సభలో నోరెత్తిన నట్టు బయల్పడి మర్యాదకుఁ గొఱంత వచ్చు. "పండితామూర్ఖజీవినః" యనులాగు మా బోటి వారి పాండిత్యము హెచ్చు. మౌనము గదా యజ్ఞులకాభరణము.

ఈశ్వ. మూర్ఖా, నీ ధూర్తవచనమ్ములచే నా మనంబు నొప్పించితివి. మూర్ఖస్యనాస్త్యౌషధమ్మను నుడి సార్థక పఱచితివి "కాలస్యకుటిలాగతిః" అనునుడి దైవవచనమ్ము వమ్ముగుటంజేసి సిద్ధించె.

(భటుఁడు ప్రవేశించి.)

భటు. చిత్రవర్మమహాప్రభూ, నిషధపురినుండి మహాదేవశాస్త్రిలు వచ్చిద్వారంబున వేచియున్నారు.

చిత్ర. వేచి యుండనేల. యథావిధిగా స్వాతంత్ర్యముగలదే ?

(భటుఁడు నిష్క్రమించును.)

(మహాదేవశాస్త్రిలు ప్రవేశింతురు.)

చిత్ర. (శాస్త్రిలను గని లేచి) బ్రాహ్మణోత్తమా, నమస్కారంబు లొనరించెద (అనుచు నతులిడి.) అలసితిరి, ఆసనం బలంకరింపుడి.

మహా. దీర్ఘాయురస్తు; రాజ్యాభివృద్ధిరస్తు రాజవరేణ్యా అగ్రజన్ములకు నలసట యనఁగా నేమి, నీ పురస్కృతికి నలరితి. ఇదిగో నీ వియ్యంకుఁడగు మా రాజు పంపిన శుభలేఖ.

(చిత్రవర్మ లేచి జాబు నందికొని)

మంత్రీ ! ఈశుభలేఖఁ జదివెదవా ?

మంత్రి. దేవరయాజ్ఞ (జాబుఁ గైకొని విచ్చి)

సకలరాజన్యకులచంద్రమా ! మిత్రోత్తమా !

నేఁ జిరకాలానపత్యతం జింతించి పశుపతిం గూర్చి తపం బొనరించి దశసహస్ర వత్సరంబు లాయువుగల పుత్రునిం గంటి ననునది లోక విదితంబు గదా! మిత్రులగు మీ రా పుత్రునకుఁ దమ పుత్రికారత్నము నిచ్చి దయాతిరేకంబున నుద్వాహం బొనరించి కుల పద్ధతి ననుసరించి జామాతను స్వల్పకాలము మీ వీట నుంచికొంటిరి; అక్కాలంబున విధి బలవంతమై యమునాహ్రదంబున జలవిహారము సలుపు విపరీతబుద్ధి నాపుత్రునకుం గలిగి పూర్ణప్రవాహంబునఁ బొంగి పారలెడు వాహినిపై వాహ్యాళి వెడలి దైవగతిం జెంది యుభయ కులములను వ్యాకులాబ్ధిని ముంచె నను ఘోరోదంతంబునకు నస్థిగతప్రాణులమైన మన ముభయులమే ప్రత్యక్ష సాక్ష్యులుగ నుండ నిద్రాహారంబులు త్యజించి దుఃఖాగ్నిచేఁ గాఁగుచు నహర్నిశముగ నుమామహేశ్వరారాధనాధీన యగు మీసుతయైన సీమంతినీయుదంతం బిఁకఁ జెప్పనేల ! మనమును, మన సకలబంధుమిత్రామాత్యసేవక జనులందఱు నీరీతి వ్యసనవారిధిలో మునింగి రాపడియుండ వైరివర్గంబు చెలరేఁగి నా పురి ముట్టడించి కళత్రసహితముగా ననుం బట్టి బెట్టిదంపు టిక్కట్టులం బెట్టి చెఱం గట్టడి గావించి రాజ్యం బపహరించి రనునది మీకును వేద్యంబైయుండుఁ గాఁబోలు. కారాగృహంబునం బడి కారియలం గుడుచుచు నహరహంబు హా పుత్రా యని తలం

చుచు నకీకవరంబు లిచ్చెనని యలీకాక్షుని నిందించుచు, విధినిఁ బోనాడుచు నిరంతర పుత్రశోకంబు సహింప నోపక, ప్రాణత్యాగంబునకు నుపాయంబు గనక బ్రతుక నోల్లక జీవచ్ఛవంబులై నిన్నటి దినంబు వఱకుఁ బడియుంటిమి. దైవమార్గంబు లతి విచిత్రంబు లను వాక్యంబునకు సరిగా నిన్నటి ప్రాతఃకాలంబున నాకస్మికముగ నా కనుపండువు నాపుత్రుండు నామోల సాక్షాత్కరించి మము బంధవిముక్తులం జేసి నన్ను సింహాసనాసీనుం గావించి కృతకృత్యుండయ్యె. ఈ విధం బెటులయ్యెనని చంద్రాంగదుని విచారింప యమునాహ్రదంబున మునుఁగుచుండుతఱి నిరవు రహికన్యకలు దనుం బట్టి తమ గృహంబునం బెట్టికొని యుండి కొన్ని వత్సరంబులపై దమ యేలికయగు తక్షకునకుం గానుకగా నర్పించిన నమ్మహోత్ముండు తన గుణసంపత్తికి మెచ్చి సకలభూషాలంకృతిచే సత్కరించి దివ్యతర కరవాలంబిచ్చి తనకొమారునితోడుగా భూలోకమునకు నంప నచ్చటం జేరి యమునాతీరంబున గౌరీశాగారంబునం గృశించు కృశోదరిం గని యా, సతి సఖిచే సకలంబు విని జననీజనకుల బంధనవిమోక్షంబు పుత్రునకుఁ బ్రథమధర్మంబని యెంచి యా సతీమణినిఁ గొన్ని సాంత్వనవచనంబుల నూఱడించి యీ పురి సరసంజేరి సఖునిచేఁ దన రాక యరిమండలికిం దెలియంబంప వారు నిర్విణ్ణులై సేయునది లేక నలుదిక్కులం బటాపంచలై పఱచిరని, నా సుతుఁడు వినిచె. సన్నీరీతి హర్షాంబుధిఁ దేల్చి తమ సన్నిధికి నేఁడు రానుండ నిచ్చటి విధివిధానప్రవీణులు గొందఱు సకలధర్మశాస్త్రంబులు శోధించి పతినష్టవ్యాజంబున విధవాత్వం బనుసరించిన సతికిఁ, బతిపునరాగమంబునఁ బునరుద్వాహం బర్హంబని వచించిరి. అట్టి శుభకార్యం బీతూరి యీ పురి యందు జరుగవలెనని పట్టణవాస్తవ్యుల సంపూర్ణాభిప్రాయంబు గావున మిత్రులగు మీరు పుత్రమిత్రకళత్రామాత్యపురస్సరంబుగ సీమంతినీ ప్రతీకాసమేతులై యీనెల॥ పంచమి నాటి కిచటికిం వేంచేసి శుభకార్యంబు నెఱపి వృద్ధుఁడగు మీమిత్రుని సంతోషవార్ధిం దేల్తురని వినయవిశిష్టతం బ్రార్థించు.

విధేయమిత్రుఁడు

ఇంద్రసేనుఁడు.

చిత్ర. (సంతోషాశ్రువులుగార్చుచు, మంత్రీ కంటివే) దైవసంకల్పంబు ఈశ్వరుభట్టు దిక్కుఁజూచి వందనంబొనర్చి) ద్విజకులవరేణ్యా, నీవు నాపాలిటి కులదైవంబవు గాని వేఱుగాదు.

ఉ. ధారుణి దేవతోత్తముని ♦ దారుణవాక్కుల నుర్కుచుఁ వనిఁ
జేరి సుఖంబుల న్మదినిఁ ♦ జేర్పక యీశ్వరిఁ బార్వతీసతిఁ

గూరిచి ఘోరపుం దపము ♦ గోరిక చేకుఱం జేసి సత్యవా
గ్ధోరణి నన్నుం బ్రోచితివి ♦ స్తుత్యుండ వీవయి తింపు నందుసుక్.
భూసురోత్తమా! నీఋణంబుం దీర్ప నలవిగాదు. పునఃప్రణామంబు లాచరించెద.
ఈ రాజ్యసామ్రాజ్యము నీయది.

ఈశ్వర. రాజచంద్రమా, ఈ యుపకృతికి మూలకారణం బీ భూసురోత్తముండు (అని నారాయణభట్టుదిక్కుం జూపుచు.) ఆ మహాత్ముని వాక్ప్రఖరత కదా భవిష్యదాపదం దెలిపి యింతటి సాహసంబునకు మార్గదర్శియయ్యె. ఇక్కాలంబున నిమ్మహానీయుండు బూజనీయుండు.

నా రా. మిత్రమా (అనుచునీశ్వరభట్టునుగౌఁగలించి) నీ దైవోపాసనాసామర్థ్యంబు నే నెఱుంగక నీ వచనంబు లనృతంబులని చిదుగుల వృద్ధిం బొందు శిఖిచెల్వున మండిపడి విద్యాగర్వంబుచే నిను హీనునిం బలె మాటలాడితి. ఉత్తముల మహిమ యింతటిదని తెలియనైతి. నీ క్షమకుం బాత్రుండ, వందనంబు లొనర్చెద.

ఈశ్వ. వలదు, వలదు. మనము మిత్రులము (అనుచునివారించుచు.)

చిత్రవ. (మంత్రివంకం జూచి) మంత్రీ, ఇది సంతోష సమయంబు, నా సుతకు సీమంతినికి నీ శుభోదంతంబు దెలిపి పిలిచికొని రమ్ము. రేపు మనమందఱము నిషధకుం బోవలయును. అలసతకు సమయంబుకాదు వెడలుదము.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# సీమంతినీనాటకము.

## పంచమాంకము-ప్రథమరంగము-నిషధపురి.

వి వా హ మ ం డ ప ము.

చిత్రవర్మ.ఇంద్రసేనుఁడు, చంద్రాంగదుఁడు, యుగంధరుఁడు, ద్విజులు సీమంతిని? చిత్ర రేఖ, ముత్తైదువులు.

(సీమంతినీ చంద్రాంగదులు గూర్చునియుందురు.)

పురోహి. రామచంద్రావధానులువారు, ఆలస్యం బేల ? ఫలమంత్రాక్షతు లీ నెఱసిన పెద్దలకిండు.

రామచం.కానిండు (అనుచు మంత్రాక్షతు లిచ్చును.)

వా.రా.చ. దశరథు నింటఁ బుట్టి జడ ♦ దారికి శిష్యుఁడునై నిశాటులన్
విశన మొనర్చి జన్నమును ♦ బెంచి యహల్యను గాచి యీశువిల్
భృశగతిఁ దుంచి జానకినిఁ♦బెండిలి యైన రఘూద్వహుం డిడున్
గుశలము నీ వధూవరుల♦కున్ నిరతంబు నవారితంబుగన్. 89

మాధవభట్లు.

ఉ. జంపగు చూపులన్ సిరులఁ ♦ జల్లి సుకంబులుఁ జూఱఁ జేయుచున్
సొంపలరారి కాళ్లు సిరి ♦ చుట్టలుగుం గల జోదు బొమ్మునన్
దుంపెస లాడుచున్ స్ఫుడమి ♦ తుందుభుకుల్ దెగటార్చి పెంపులన్
నింపుచు సంతసంబు సిరి ♦ నెయ్యమునం గలిగించుఁ గావుతన్. 90

కేశవాచార్యులు.

ఉ. వెంపరలాడి ముజ్జగము ♦ పెంపు వెలార్చెడి సోకుమూకలన్
జంపఁ గలాని పట్టి నిడు ♦ జన్నఁపు వేటరి యంచు వేలుపుల్

గుంపులు సేరి వేఁడ మదిఁ ♦ గూరిమిఁ గట్టులపట్టిఁ గూడుచున్
సొంపెసలారు దేవ రిడు ♦ సోబనముల్ సిరులు స్థిరంబుగన్. 91

గోవిందజోస్యులు.

శా. ఇంద్రాగ్న్యంతకకర్బురాప్పతిసమీ ♦ రేశానమిత్రేశులున్
జంద్రాదిత్యకుజుల్ బుధుండునుసురా ♦ చార్యోశనుల్ మందుఁడున్
సాంద్రోద్దీపులు కణ్వాకశ్యపులు వి ♦ శ్వామిత్రవాసిష్ఠు లా
చంద్రార్కంబుగ నీ వధూవరుల ని ♦ స్తంద్రంబుగాఁ బ్రోవుతన్. 92

మధుసూదనయజ్వ.

ఉ. పేరిముడి పుత్రపౌత్రసము ♦ పేతులఁ జేయుచుఁ బెక్కు కాలముల్
సేమ మొసంగి ప్రోతురు వ ♦ సిష్ఠకుటుంబిని కుంభసంభవున్
భామిని సత్యవంతు లల ♦ నామణి యింద్రుని రాణి ధాత రా
మామణి యాసుదర్శనుని ♦ మానిని యీ సుకుమార కాయులన్.

పురోహితుఁడు (రామచంద్రావధానులంగని) రామచంద్రావధానులు. ఇఁక ముత్తైదువులపని కానింపు. హారతియెత్తవలయును. మనయింటిదానినిరమ్మనుఁడు.

రామ. మన యింటి దనఁగా నెవరండీ! నా భార్యయా.

పురో. ఏమయా! అటు మాటలాడెదవు! నా భార్యనయా పిలువు మనినది.

రామ. ఓ అటులనా? పిలిచెదను. వేఱొక తరుణి వలదా? ఆరతి పళ్లె మొక రెటు పట్టుదురు?

పురో. (ఆడంగుల శాస్త్రము పాడుశాస్త్ర మని పలవరించుచు) అవునయా! ఆగమ విధి తప్పినను తప్ప వచ్చును. ఆడంగుల విధి తప్పిన దోసము.

రామ. అటులయిన నాయింటి యామెను బిలుతునా?

పురో. నా యింటి దానినే పిలువు మని నేఁబలికినది.

రామ. అయ్యో పాపమా! నా భార్యను బిలుతునా యని యడిగితి నండీ.

పురో. ఓహో అటులనా నిజము నిజము ఇంచుక సరసకు రమ్ము.

(రామచంద్రావధానులు సమీపించును)

(చూడుము పళ్లెములోఁ బడిన దానిలో మా దానికి మూఁడు భాగములు నీ భార్యకు నొక భాగము.

రామ. కారణ మేమండీ! మా యింటిది పాటలు పాడును సలక్షణముగా నున్నది.

పురో. (తనలో) (ఈ క్రిస్తున కెన్ని తూరులు సెప్పినను పాటలు నేర్చికొనదు. రూప మెటు లుండిన నేమి?) (ప్రకాశముగా) రామచంద్రావధానులు, అటు లయిన మా దానికి రెండు భాగములు. నీ భార్య కొక భాగము.

రామ. స్వామీ! నిజము పలికెదను. పౌరోహిత్య సామ్యములో మన మేరీతి భాగించి కొన్నను సరి గాని యాడువారి కట్టడములోఁ దబ్బిబ్బయ్యెనేని రారాని చిక్కులు వచ్చును. ఇది వఱకే నా కనుభవ మైనది. పడక యెటులయిన నుండనీ కడుపు చూడ వలదా! నేనే చేయి కాల్చుకో వలసి వచ్చును.

పురో. అటు లయిన నీ భార్య యంత గయ్యాళియా!

రామ. పేటి ముత్తైదువల కంటె నుత్తమురాలు. నీ భార్యకన్న నూఱంతలు మేలు.

పురో. ఏమయా ఆ మాటాడెదవు! నా యిల్లాలిని జూచినఁ బెఱతెఱవలు తల వంచి కొనియెదరే.

రామ. ఎందుకు కలహాకంఠి యనియా! "స్పష్టమగ్రేభవిష్యతి" కానిండు. మన కేల యాడంగుల కలతలు. పంపులు వారే నిర్ధారించి కొనియెదరు.

పురో. అటు లయిన వారినిఁ బిలువుము. ప్రొద్దైనది.

రామ. మంచిదయ్యా పిలిచెదను.
పురోహిత శేషమ్మగారూ! రండి.

శేషమ్మ. ఏమయ్యా! నన్నేల పిలిచెదవు? ఊరక యుండలేవా?

రామ. మీ యజమానుల వారు పిలిచెదరమ్మా.

శేషమ్మ. నే రాను. నాకు నే యజమానులు లేరు.

రామ. (పురోహితునిం గని.) ఏమండీ, చూచితిరా, మీ వారు రానని యెదరు. మఱి యేదియయినను బిలుతునా?

పురో. నిలువ వయ్యా! ఏల త్వరపడియెదవు (అనుచు లేచి) ఏమే జాగ్రత్తగా రా, హారతి యెత్తవలెను.

శేషమ్మ. ఏమి చేటటు పిలిచెదరు. నేను రాను, అచటికి వచ్చినచో బాటలు పాడ మని నా గోడు పోసికొనియెదరు.

రామచంద్రావధానులు (తనలో) ఇది యెంతటి గయ్యాళిరా, రాజు లుండు వఢ యని కూడఁ జూడదు.)

పురో. లేదే! నీవేమియుఁ బాట పాడ నక్కఱ లేదు. మఱి యేరయినఁ బాడుదురు.

శేషమ్మ. (ఆటఘున వచ్చెద.)

పురో. మా దానికి సిగ్గు బలము. మంచిది నీ భార్యను బిలువుము.

రామ. ఏమే! వధూవరులకు హారతి యెత్తవలెను, త్వరలో రా!

పార్వ. రా, రా యనుట కేమి. పాటలకు నేను, పణమునకు నామె, మంత్రమునకు మల్లుభట్టు తిండికి యల్లుభట్టు.

రామ. (పురోహితునిం గని, చూచితిరండీ, పణమునకు వచ్చిన పోట్లాట.) (భార్య వంకఁ దిరిగి) అది కాదు, రా, పణము నీవే పంచి యిత్తువు.

పార్వ. అటులైయున వచ్చెద. (అనుచువచ్చును.)

(పార్వతమ్మ, శేషమ్మ, హారతిపళ్లెముపట్టికొని)

పార్వ. శేషమ్మగారూ, పాడెదరా?

శేషమ్మ. అవునే మిటారీ! నీ వించుక పాటలమారిగా నుంటఁజేసి సభలో నెంత మిడిసి పడియెదవు. పదుగురిలోఁ బాత్ర లాడుచు నను వెక్కరించెదవు.

పార్వ. ఏమమ్మా! మర్యాదకుఁ బాట పాడుమని యడిగిన నెన్ని మాట లాడెదవు? వచ్చిన కట్టనము గట్టి కొనుటకు నీవు పాటలకు నేనా? పల్లవి నైత మనవే? నా గ్రహచారము, నీతోఁ బళ్లెము పట్టినపు డెల్లఁ బల్లవి లేని పాటలే పాడ వలసి వచ్చును.

శేషమ్మ. మంచిది లే! ధయ్యాని యాడకు. పళ్లెపుఁ దగవిపు డేల? ముందు తీర్చికొందము. ఇపు డింత పాడి వేయుము.

పార్వ. (వధూవరులకుఁ దాంబూలము లిచ్చి)

## మంగళమహా శ్రీవృత్తము.

కంపనము లేని యనుకంప జనియింప మన ♦ కాపురముల న్ననుచు శ్రీణిక్
సంపదల తంపఱలు, సంపతిలి యింపలరు ♦ సంబరమున న్దనరి యీ మా
దంపతులు పెంపుఁగని, తొలిమికిఁ దావులయి ♦ తొల్య రహితంబుగ రహింపన్
గుంపులుగ భామినులు, గూడికొని శ్రీహరిని ♦ గోరుదు మనారతము భక్తిన్.

(పళ్లెము మూడు మార్లు త్రిప్పుదురు. దంపతులు రత్నములు పళెమున వేయుఁగా పార్వతమ్మ పళ్లెము తీసుకొని వెళ్లును)

పురో. (శేషమ్మనుం గని) ఏమే, అటు జబ్బుగాఁ బోయెదవు? ఆయమ షర్లైము తీసి కొని పోయెను. నీవును ద్వరగాఁ బోయి పంచికొమ్ము.

శేషమ్మ. జబ్బుగా నడవక పక్షి వలె నెగురుదునా? అక్కలయినసం గట్టు. దానికేమి వయసు మండిపడి పోవుచున్నది. (అనుచునిష్క్రమించును)

పురో. ఇంద్రసేనమహాప్రభూ: ఇఁక దక్షిణకు మొదలిడిన బాగుగా నుండును. దంపతు లను దేవతా గృహంబునకుం బిలిచికొని పోదము.

ఇంద్ర. భూసురోత్తములారా! అటుచేయుఁడి. దక్షిణకు నిపుడే మొదలిడ వెడలెదను

(అందఱును లేచి దంపతులను బిలిచికొని మంగళనాదములతో నిష్క్రమింతురు)



శ్రీ

# సీమంతినీనాటకము.

## షష్ఠాంకము - ప్రథమరంగము - కుండిననగరు.

రాజుచంద్రవర్మడు, మంత్రిమతిగుప్తుఁడు. సామవంతుఁడు, సుమేధుఁడు.

చంద్ర. వింటివే మతిగుప్తా, నిషధ నేలుచు నిత్య కీర్తిఁ గనిన యింద్రసేనుండు తన నూనునకుం బట్టంబుఁ గట్టి తపంబు సేయ నరణ్యంబుఁ జేరెనఁట. పుణ్యాం బనిన నా మహానుభావుని సొమ్ము. "సుపుత్రః కులదీపకః" అనునది యా చంద్రాంగదుని యెడ సార్థకతఁ జెందెనయా.

మతి. మహాప్రభూ, ఆ చంద్రాంగదుని ప్రతాపంబున కంటె నాతని సహధర్మిణి సీమంతినియొక్క సోమవారవ్రత మహిమ వారి రాజ్యంబునకు వన్నెఁ దెచ్చినది.

చంద్రా. అవునయా, ఆ మహిమ వారి రాజ్యమునకేమి, సర్వ రాజ్యములకు ననవచ్చును కావుననే సకల మహీజనులు మహితముగా నెన్నుచున్నారు. ఆ సతికి నాస్తి యను వచనంబు రాదఁట.

(భటుఁడు ప్రవేశించి.)

భట. మహాప్రభూ, అగ్రహారంబు నుండి ద్విజకుమారు లిరువురు దర్శనార్థ వేంచేసి ద్వారంబునం గాచి యున్నవారు.

చంద్ర. రానిమ్ము; (భటుఁడు నిష్క్రమించును) (మంత్రి దిక్కుం జూచి) మతిగు యొక వినోదంబు సలిపెదను. ఆ బ్రాహ్మణ బాలకులు రానిమ్ము, నీ మౌనమ్ము ధరించి యుండుము.

(ద్విజకుమారులు ప్రవేశించుచున్నారు.)

(సామవంతుఁడు ఫలమంత్రాక్షతలు సేత నుంచికొని రాజుంగని)

ఉ. స్వస్తి సమస్త వైరిజన ♦ సాధన యోగ్య కృపాణ పాణికిన్
స్వస్తి సమస్త దేవగణ ♦ సాధన యోగ్య సుకర్మ శాలికిన్

స్వస్తి సమస్త భూమిజన • సాధన యోగ్య మృదూరు వక్త్రకున్
స్వస్తి విదర్భ మండల నృ • పాల శిఖామణికిన్ ధ్రువంబుగన్. 95

(అనుచు ఫలమంత్రాక్షతులిచ్చును రాజందికొనును.)

సుమే. చ. జయమగుఁ గాత శ్రీశకృప • సంపద లెప్డును గల్గుఁ గాత భూ
రియశము నాయురున్నతుల • వృద్ధి యొసంగెడుఁ గాత సేవకుల్
నయ వినయ ప్రచారులయి • నచ్చిక నుందురు గాత ధారుణిన్
నియతిని బ్రోచు నట్టి మతి•నీ కిడుఁ గాత మహేశుఁ డెత్తటిన్.96

(అనుచు ఫలమంత్రాక్షతు లియ్యఁగా రాజందికొని.)

చంద్ర. ద్విజకుమారులారా! అర్చిష్మంతుని వలె వెలయు మీ ముఖ వర్చస్సు మీ పాండిత్యమును వెల్లడింపఁ జేయుచున్నయది. మీ రేయే విద్యలు నేర్చితిరి. ఎక్కాలక్షేపం బాశించి నను జేరితిరి.

సోమ. మహాప్రభూ.

శా. సాంతంబయ్యెను వేదశాస్త్రములువే • దాంగంబులున్ వైద్యరా
ద్ధాంతంబు ల్గణితంబు లాది గల గ్రం • థంబు ల్సమస్తంబులున్
దాంతి న్సద్గురు సేవ నేర్చితిమి మే • ధావంతులై, యైన నా
యంతర్వాణుల వండ నండ గొను దీ • నావేశ మీడాడెడిన్.97

సుమే. మహాప్రభూ! విద్యాభివృద్ధియెందున్నదియో యందు దారిద్ర్య దేవతా సాన్నిధ్యంబు సిద్ధంబై యుండు ననునది మా యందు సిద్ధించినది. ఏమి సేయుదుము, కాననే వటువులుగా నిలిచితిమి.

చంద్ర. భూసురులారా! ధనాపేక్షులై వచ్చితిరి కాఁబోలు. ధర్మమే, ప్రస్తుతము మీ యోగ్యతకుం దగిన బహూకృతి సేయ నేఁ జాల కున్నాడను. అయిన మిము స్వార్థమనోరథులఁ జేయ నోపను. (అనుచునించుకయోజన సభినయించి తలయూఁచి) వటూత్తములారా! మీ కోరు ధనంబు ఫలించు మార్గం బొకటి తోఁచినది.

సోమవం. మహాప్రభూ! అదియెద్ది?

చంద్ర. ద్విజోత్తములారా! నిషధేశుండగు చంద్రాంగదునిసతి సీమంతిని సోమవార వ్రతంబు సేయుచు నాదినంబున ద్విజదంపతులను గౌరీశులుగా నారాధించి వారికి నత్యధిక దక్షిణ లొసంగును. మీలో నొకరు స్త్రీవేషమును ధరించి సతీపతుల భంగి నాసతినిం జేరి మీ యిష్టార్థంబులు పడయుఁడి, కృతార్థతఁ గనుఁడి.

సుమే. మహాప్రభూ! ఇంత పాపమా?

ఉ. నిందితులై కొఱం బడమె ♦ నీచఁపు వంచనఁ జేసి, శప్తులై
కుందమె, ఘోర యాతనల ♦ కు న్గుఱిగామె కృతాంత పత్తనం
బందు, సమస్తము న్దెలిసి ♦ యాడఁగ నీ కిటు లౌనె? బ్రాహ్మణుం
డెందును సత్య శీలముల ♦ కేడుగడై కద యేపు మీఱెడిన్. 98

రాజవరేణ్యా! మముఁ బోలు శుద్ధ శ్రోత్రియులకనాచరణీయంబు గదా యిట్టి కుటిల విచారంబు

చంద్ర. చ. ద్విజవరులార! మీరు బహు ♦ విద్యలు నేర్చితి రౌను గాని మీ
నిజమగు బుద్ధిజాడ్యమును ♦ నీఁగఁగఁ జాలరు; క్షోణియందు స
ర్వజనుల నాజ్ఞలో నిడి నృ ♦ పాలకుఁడౌ ననుఁ గా దటంచు మీ
కుఁజనునె యాడ బుద్ధు లివి ♦ కూడవు చేయుఁడి నా నుడి న్వడిన్.

భూసురోత్తములారా, "నావిష్ణుః పృథివీపతిః" అనెడి యార్యోక్తి మీ రెఱుంగ నదియా? నా యానతి మీఱం దగునా? మీఱినచో మీ కిహపర సుఖంబులు దూరంబులు గావా? ఏల మీరీ దురితంబుల పాలయ్యెదరు!

(సోమవంతుఁడుసుమేధుఁడు యోజించి.)

సోమవం. ప్రభూ, భవద్వాక్యోల్లంఘన చేసి బ్రతుకు టెటులు? కర్మానుసారం బయ్యెడు.

చంద్ర. ద్విజకుమారులారా, ఇది కదా మీ వివేకతకు వన్నెఁ దెచ్చు మార్గంబు. ప్రచ్ఛన్న వేషం బభేద్యంబై యుండు నటుల వస్త్రాభరణాద్యలంకృతులఁ గైసేయ పరిచారకులకు నాజ్ఞ యిచ్చెద. ఆ సతీ మణినిం గికురించి యభీష్టావాప్తిఁ గనుఁడి. వెఱవకుఁడు. సేమముతోఁ బొండు లాభముతో రండు.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# సీమంతినీనాటకము.

## సప్తమాంకము - నిషధపురి.

### ప్రథమరంగము - సామవంతుఁడు - సుమేధుఁడు.

సామ. సఖా, పురి సమీపించితిమి. హా! హా! ఏమీ యీ వైభవంబు కంటివే.

రగడ.

సా. పేటఁగ జిగిబిగి ♦ నెగడెడు కోటలు.

సు. కోటల నలుగడ ♦ గొఱలెడు పేటలు.

సా. పేటల వాటిలఁ ♦ బెరిఁగిన బాటలు.

సు. బాటల నిరుగడఁ ♦ బసనగు తోఁటలు.

సా. తోఁటలఁ దెరతెర ♦ తొరఁగెడి యూటలు.

సు. ఊటల తేటల ♦ నూఁగెడి తేఁటులు.

సా. తేఁటుల కోటుల ♦ తేలిక పాటలు.

సు. పాటలు విను పసి ♦ బాలుర యాటలు.

సా. ఆటలకును మది ♦ నలరెడి బోటులు.

సు. బోటుల తియ్యని ♦ పొలుపగు మాటలు.

సా. మాటల మరులయి ♦ మను వాచాటులు.

సు. చాటులు జోయుచుఁ ♦ జనియెడి జోటులు.

సా. జోటులఁ జొక్కెడి ♦ చొచ్చిన చోటులు.

సు. చోటులు వెదకుచు ♦ సొలసిన మేటులు.

సా. మేటుల లోఁ గొను ♦ మెలతల జూటులు.

సు. జూటుల నెఱుఁగక ♦ చొక్కెడి పాటులు.

సా. పాటులఁ బడి యొగిఁ ♦ బొఱలెడి దాటులు.
సు. దాటులు వలదనఁ ♦ దగు కను గీటులు.
సా. గీటుల నెడదను ♦ గీఱిన తూఁటులు.
సు. తూఁటుల మాపను ♦ తొరపడు చేటులు.
సా. చేటుల మాటలఁ ♦ జెలఁగెడి సీటులు.
సు. సీటుల విటులకు ♦ నిలిపిన పీఁటలు.
సా. పీఁటల వారల ♦ ప్రియమగు మాటలు.
సు. మాటల చవులకు ♦ మహిఁ గన సాటులు.
సా. సాటులు లేవని ♦ చాటెడి కూటులు.
సు. కూటులఁ గొలుచును ♦ గొలుచు కిరాటులు
సా. రాటుల రాపిడి ♦ రక్కెను గాటులు.
సు. గాటుల నడఁప న ♦ గరు సీరాటలు.

సా. సఖా. ఈపురివైభవంబును గను సంభ్రమంబునఁ దత్రి మఱచితిమి. ద్విజదంపతులు చాలుచాలుగా బోవుచున్నారు కనుము.

సు. నిజము సఖా (కాదు కాదు) సఖీ, మనమును వేగంబ పోవుదము.

రామవతి. సుమేధా! నా వేషంబున న్యూనత యేమయినం గలదా? చక్కగాఁ జూడుము. ఇపుడే సవరించి కొనియెద.

సుమే. (ఎగాదిగఁ జూచి) సఖీ, ఏ లోపంబును లేదు.

సీ. నీ గొప్ప కొప్పిం ద్ర ♦ నీలరాశి గమించు
నీ మొసల్ చంద్ర కాం ♦ తిని హసించు
నీ బొమ ల్కరువిండ్ల ♦ నీటు గీటడగించు
నీ చూపు మరుతూపు ♦ నిగ్గుఁ జూపు
నీ నాస సంపెగ ♦ నిక్కు నుక్కడగించు
నీ చెక్కు టద్దము ♦ ల్నెగడెదుఁ గడు

నీ చెవుల్ శ్రీకార ♦ నిర్ణయం బొనరించు
నీ మోవి పల్లవ ♦ నిధిఁ దనర్చు
తే. గీ. నీ రదంబులు హీరంబు ♦ లై రహించు
నీ గళంబున శంఖంబ ♦ నాగఁ బరఁగు
నీ మొగంబు మహాపద్మ ♦ నిధిగ నెసఁగు
లోప మెద్దియు లేదు వి ♦ లోల నయన. 101

సఖీ, యదార్థస్త్రీల రూప యౌవన గర్వంబు సర్వంబు నిర్మూలనంబు సేయు నీ యంగ సౌష్టవ ప్రకృష్టత మించు చున్నయది. మంత్రహతమ్మగు నను భయంబు లేదు. త్వరలో సీమంతినీ గృహంబు సేరుదము.

సామవతి. అటు లయినఁ బోవుదము.

(నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము - సీమంతినీగృహము.

సీమంతిని. కలవాణీ, విప్రదంపతులు. సామవతి. సుమేధుఁడు.

సీమంతిని. (విప్రదంపతులకు వందనం బొనరించి పూజించి)

జననీ జనకులారా, మీ యభీష్టం బెద్దియో యాన తిచ్చిన భర్తరా లీశ్వరానుగ్రహంబున నెఱవేర్ప నోపుదు.

భర్త. తే. గీ. దానముల నెల్ల నెన్నఁగఁ ♦ దగినదమ్మ
భూసురోత్తమునకు నిడు ♦ భూమి దాన
మతివ యటు గాన నెమ్మది ♦ నవని దాన
మిచ్చినను జాలు ద్విజులకు ♦ నేమి వలయు? 102

భార్య. (భర్తనుం గని) ఓసి నిర్భాగ్యుఁడా, కర్షకుఁ డయ్యెదవా? మన కేల భూమి? ఆహారమునకు మధుకరవృత్తి లేదా! కామధేనువును జేరి కాసిమ్మన్న విధమ్మున దానచక్రవర్తినిం జేరి భూదానం బడిగితివే? నా శరీరం బంతయు వస్త్రాభరణాద్యలంకృతులం గై సేయుమని యడగ వలదా? నాలుకపై శనైశ్చరగ్రహ ముండెఁ గాఁ బోలు.

సీమంతిని. తల్లీ! భర్తనేల దూషించెదవు? నీ యభీష్టంబును నెఱవేర్చెద. (పరిచారకునిం బిలిచి) ఓరీ, ఈ భూసురుండు గోరిన భూమియు నీ సతీమణి కోరినవస్త్రాభరణములిచ్చి వీరికి మనోమోదంబు గల్పింపుము.

పరిచార. ఆజ్ఞానుసారంబుఁ గావించెద. (అనుచు దంపతులను బిలిచికొనిపోవును.)

సీమంతిని. (సామవతి సుమేధులవద్దకుంజని వారింగని) (స్వగతము) ఏమి యచ్చెరువిది! ఈ విప్రాంగన విధం బొకతీరుగా నున్నయది. కానిమ్ము, ఎటు లుండిన నేమి? ఈ దంపతుల నుమామహేశ్వరులుగా నేభజింతును. (సరసం జేరి సుమేధుంగని.)

ఆ. వె. నినుఁ బురాణపురుషుఁ ♦ డని మది నెంచుచు
వందనంబు లిడెద ♦ నందవయ్య

(అనుచు నతులిడి సామవతింగని)

సామ. తల్లి నిన్ను సతిగఁ ♦ దలఁచుచు నిపుడు నే
నతు లొనర్తు నీకు ♦ నతుల భక్తి. 103

(అనుచు నతులొనరించును.)

సు. మే. క. చిరకాల మైదువగ మను
పరమపతివ్రత యటంచుఁ ♦ బ్రఖ్యాతవుగ
స్థిరవారెడి యీవిగొనం
బరుదారఁగఁ గాంచి కీర్తి ♦ ననువుగఁ గనుమా. 104

సీమంతిని. దంపతులారా. మీ యభీష్టం బెద్ది!

సు. చ. చదివితి నెల్ల శాస్త్రములు ♦ చక్కఁగ నేర్చితి నెల్ల వేదముల్
కుదిరెను సర్వ సంపదలు ♦ కూటికి నింత కొఱంతకాని వే
ఱెదియును లోపము స్గలుగ ♦ దీశ్వరు సత్కృపచేత నిప్పుడా
కొదవయుఁ దీర్పఁగా ధనముఁ ♦ గోరితిఁ గోమలి యిచ్చి కావుమా.

సతీమణీ. పేదతనము ముదిరినది మిగత సంపద లన్నియు నున్నయవి కావున ధనంబిచ్చినం జాలు. ఇదియే నా కోరిక.

సీమంతిని. (సామవతిం గని) అంబా, నీ యభీష్టం బెద్ది!

సామవతి.సతీమణీ, భర్త యభీష్టంబునకు వెలిగా భార్య కోరున దేమి యున్నది? భర్త కోరకయే నా కోరిక.

సీమంతిని.(పరిచారకునిం గని) ఓరీ, ఈ దంపతులను ధనాగారంబునకుం గొని పోయి పుష్కలధనం బిచ్చి పంపుము.

పరిచా. ఆజ్ఞానుసారంబుగ వర్తిల్లెద (అనుచుం బిలిచి కొనిపోవును.)

సీమంతిని.(కలవాణింగని) కలవాణీ, ఇతర దంపతు లేరు నిదివఱకు రారు గదా, త్వరలో బిలిపింపుము. గృహంబునం గాచి యుండెద.

(అనుచు నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

సామవతి, సుమేధుఁడు.

---

సామవతి.ఏల, వడిగా నడచెదవు? అబలలు మందయానలు గదా?

సుమే. సఖా, బూటకము లిఁక నేల? కార్యంబు సిద్ధించెను. నీవలసి యుండినచో నీ రాత్రి నిచట నివసించి యలఁతఁ దీర్చికొని యుదయమున లేచి పురిఁ జేరుదము. సాయంసమయ మైనది. ఈ తటాకంబుఁ జేరి సంధ్య కృత్యంబులు దీర్చికొందము. నీవేసం బిఁక వదలుము.

ఉ. ఇత్తఱి నత్తమిల్లెఁ గను ♦ మిద్దెస భానునిఁ జిత్త మంజికన్
హత్తఁగ నీక యింక మన ♦ మంకిలి కగ్గముఁ గాక యుండఁగాఁ
జిత్తముఁ దేర్చి యీ వనముఁ♦జేరుచు బూమియ నీఁగఁగా నగున్
బిత్తరి రూపుఁ దాల్చి యెటు♦వీటికిఁ బో నగు మాన హానిగన్. 106

సామవతి.ప్రియుఁడా చిత్రంబులు గదా నీ వచనంబులు, యదార్థాంగనకు వేషం బేమి? వేషధారిగా నే నగు పడియెదనా?

సుమే. సఖా, నినుఁ జూచినచో స్త్రీలు తల వంచికొని యెదరు. అందున సందియం బేమియు లేదు, నీ ముఖ విలాస మసదృశము గా నున్న యది.

మ. సకియా, నీ ముఖ చంద్రు దిగ్విజయమున్ ♦ సైరింపఁగా లేక కా
నక వెన్నంటుచు నీ శిరంబు పయి నుం ♦ డ న్నిల్పెఁ గాలాహినిన్

సకలాశేశులఁ గెల్చు నీ దృగళి పుం•జం బంచుఁ దా నెంచి చం
పకమ్ నెవ్వరిని వద్ద నుంచె నజుఁ డా•ప్రాగల్భ్యముం గంటివే. 107

ఇట్టి నీ రూపంబున నే లోపంబును లేదు. ఆయన నిటు లుంట సరికాదు. నీ నిజరూపంబు ధరింపుము.

సామవతి.(సిగ్గుతో సరసం జేరి,) నాయకా, నా నిజరూపముతో నున్నదానను. నాకు వేఱు రూప మెచ్చట వచ్చును. ధరించు టేమి?

సుమే, సఖా, చాలుఁ జాలు నీ వేళాకోళములు. నీ పురుష రూపంబు గైకొనుము. మాయా మానినీత్వము వదలుము.

సామవతి. కాంతా, నీ వింకను భ్రాంతి వదల వేల? నేను నిజముగ స్త్రీని. పురుషుఁడను గాను, నీవే నా పురుషుఁడవు. (అనుచు గేల్వట్టును. సుమేధుఁ డించుక దూరంబున కేగును) నాథా, దూరం బేగద వేల? విరహోద్దీపకము లిచ్చట నిన్ని జత కూడి యుండ నే నెటు సైఁతు? ప్రియతమా, ఈ తరువున నుండు శారీ శారికల తీరెంతముచ్చటగా నున్నది!

ఉ. సగ్గిసముగ్గిస ల్వడుచు • శారిక కోరిక లీరికెత్తఁ దా
సిగ్గఱి భర్తనుం గలసి • సేదల సొగ్గుచు నిగ్గులాడుచున్
లగ్గులు గాంచు రీతిఁ గని • లాలన సేయుమ నన్నుఁ బ్రోవుమా
యగ్గల మయ్యె నంగజుని•యచ్చల మిత్తఱి సైఁప నేర్తునే? 108

(అనుచు మరల సమీపించును.)

సుమే. సఖా, ఏమి యీ విపరీతచర్య? అవమానాస్పదంబు.

సామవతి. క. విపరీతము గాదో ప్రియ
యుపపాడియుఁ గాదు నిక్క • మగు కన్యను నన్
దపియింప నేల? యింక నను
గృపఁ బ్రోవుము యతను నదటు • గినుమాడి వెసన్. 109

సుమేధా. జాల మింక నిమిష మైనను దాళఁ జాల. నన్నేలుము.

(అనుచుఁ గేలు గట్టిగాఁ బట్టును)

సుమే. సఖా, హాస్యంబునకుఁ బరిమితి లేదా? ఏమి యీ విదూషక విద్య! ఎపుడు నేర్చితివి? ఛీ ఛీ చాలుఁ జాలు వలదు వలదు.

పామపతి. సుమేధా, నే నెంత తెలిపినను నామాట యందు నమ్మిక తోఁపదు గదా? ఏమి సేయుదు, నాథా విను మొక విశేషంబుఁ దెలిపెద.

సీ. అలనాఁడు నాయన ♦ మందిన తతి నుండి
నిజ మగు నెలఁతనై ♦ నెగడు దాన
గుట్టుఁ దాపఁగఁ జూచి ♦ పట్టఁగ లేనైతి
నంగజు నలజడి ♦ యధిక మయ్యె
అఱమఱ వల దిఁక ♦ నరయుమా నను నీవు
నఱగొఱ యించుక ♦ యైన వలదు
కబరీ భరమ్మును ♦ గను విచ్చి కనుగొమ్ము
పుట్టినట్టిదొ గాక ♦ పెట్టినదియొ.

తే-గీ. మొగము కనుఁగవ మెడ నడు♦ములను గనుము
నమ్మ కున్నను నీ కెద్ది ♦ నమ్మిక యగు
నట్టి యనువుల నరయుచు ♦ దిట్ట వగుము
కాని విడనాడ నోపను ♦ గంతు దాడి. 110

(అనుచుఁ బైన వాఱ్రిలును.)

సుమే. (ఎగాదిగఁ జూచి విహ్వలుఁడై దూరంబున కేగి).

మ. అలవ్రాక న్ననుఁ నాఁకపెట్టి యలమ♦న్నా ట్రయంబె! యీ రాక నీ
కలవా టాయెనె! యెంత వాకొనిన నీ♦ వాలింప వేమందు ని
చ్చలు శాస్త్రాధ్యయనాది చింతనల శ♦ శ్వత్కీర్తియుం గన్న మా
కులమం దీ వ్యభిచార దోష మగునే♦ కోల్పాటుఁ జంతింపవే. 111

ఛీ ఛీ, నీ మార్గంబు సత్కులాచార విచారంబునకు దూరంబు. హా, హా, ఆ పతివ్రతాశిరోమణీ సుచరిత్రంబు మము నింతటి దురిత ఫలం బిహంబున ననుభవింపం జేసెఁ గదా, కటకటా, రాజు మాట విని రట్టడి పాలైతిమి,

ఆ. వె. అవని పాలు నాన ♦ నచ్చికంబును లేక
యావటముగ నిటుల ♦ నాచరించి

యఘ మనర్ఘ్యముగను ♦ నార్జించితిమి కటా
తెలియ వలయు దీనిఁ ♦ దొలఁచు విధము. 112

హా, హా. ఏకదేశంబున మన మిటు లుంట దోషాస్పదంబు. ఈ రాత్రియే మెల్లన నడచి పురిఁ జేరుదము. నా హితంబు చెవి యొగ్గి వినుము. మన తలిదండ్రుల కీ యుదంతంబు నివేదించి వారి యానతి రీతి నాచరింతము.

సామవం. (నిట్టూర్పు విడుచుచు) సుమేధా, నీవు నా భర్తవని త్రికరణ శుద్ధిగా నమ్మి నీ మాట జవదాటుట నా బోటి బోటికి హితము కాదు కావున నీ యాజ్ఞ శిరసావహించెద.

సుమే. అటు లయిన నీ రాత్రియే పురిఁ జేరుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# సీమంతినీనాటకము.

## అష్టమాంకము - ప్రథమరంగము.

చంద్రహాసుఁడు. మతిగుప్తుఁడు. సారస్వతుఁడు, సామవతి, భటులు.

చంద్ర. (మతిగుప్తునింజూచి) మతిగుప్తా, నాఁడావిప్రకుమారకులఁ గికురించి యందొకరికి స్త్రీవేషంబు వేయించి పంపియుంటిని గదా, వారాసీమంతినీసతిం జేరి యభీష్టంబు లొందియుందురుగదా.

మతిగు. ప్రభూ, ఆ సతీమహిమాతిరేకంబున నీ మంత్రంబుహతంబై యుండవచ్చునని నాకుం దోఁచెడు.

చంద్ర. మతిగుప్తా, అటు లేనాఁటికినిఁ గాదు. స్త్రీ వేషంబయినను నిజముగ స్త్రీగ నగుపడుచుండెను.

(ద్వారంబునఁ గలకలము.)

భటుడు. ఎవడయానీవు! అటుల త్రోసికొని పోయెదవు? నిలు నిలు సమయంబుగాదిది.

సారస్వ. ఓరీభ్రష్టా, సమయమేమి, అడ్డగించిన నిను నష్టు సేయువారెవరు! (అనుచు సామవతిని నచటనే వదలి త్రోసికొని రాజసమ్ముఖమ్మున వచ్చి రూక్షేక్షణములతోఁ దలకాలుప క్రిందఁ బడవేయును.)

చంద్ర. (వెఱచి లేచి) ద్విజోత్తమా, నతులొనరించెద,

సారస్వ. ఛీ, చండాలా, నీ వందనంబు లేరందుదురు! నా కుల మేపు మాపెఁ గదా నీ యపచారంబు. ఇపు డీశుష్కోపచారంబు లేల!

ఉ. ఎంతటి వాఁడ వీవు వసు ♦ ధేశ్వర! యింతలు సేయ నోపితే!
యింతలె రాజసత్తముల ♦ విప్రులు వేఁడుట దీనవృత్తిమై?
చెంత ధనంబు లేనియెడఁ ♦ జింతయె బ్రాహ్మణ! నిట్టి ధార్ష్ట్యమి
ట్లింతగఁ జేయ ధైర్యమువ ♦ హించితె! విప్రులు వంచనార్హులే? 113

ఛీ దురాత్మకా, నీ యట్టి నీచాధముని ముఖదర్శనంబు పాపమూలంబు.

చంద్ర. విప్రోత్తమా, అకారణంబుగఁ గినియుటేల! నేనంతటి పాపకృత్యం బేమొనరించితిని?

సారస్వ. క్షత్రియాధమా, కతంబెఱుంగని వానిం బలె నా ముందల నటించెదవా?

చ. ధరణివిభుల్ ద్విజన్ములను ♦ ధర్మపథంబున నిల్పి ప్రోతు రి
క్కరణిని నన్యవంచనకుఁ ♦ గట్టిడి సేతురె? దిక్కు లేదయో
యరయఁగ నెందు! నింత♦యుడియీవడి రాజులు సేసిరేని నె
వ్వరి కిడనో మొఱల్! వసుధఁ♦బాడిగనన్ బడి ప్రాడిపోయెనే? 114

ఓరీ, క్షత్రియవంశనాశకా, నీవంచనకు వేఱొరును లేరైరా? అకటకటా! తపఃఫలంబునఁ గనిన సుగుణాన్వితుని నాసుతుని నుతనుఁ జేసితివే? ననుం దుర్గతికిం ద్రోసితివే? ఇట్టి దార్ష్ట్యమున ముదమందితివే? నిన్నేమనిన నామనస్తాపంబుఁ దీఱును?

(చంద్రహాసుఁడు త్రిచ్చవడి నిలుచును.)

మతిగు. భూసురవరా, సత్వగుణప్రధానులగు మిముఁ బోలు మహనీయు లాగ్రహాగ్రహ పీడితులౌట యనుచితము. ఉపశమింపుడు. కినుకనుం గత మెఱింగింపుడు.

సారస్వ. మతిగుప్తా, నే నేమని వాకొందు,

క. యాచకుఁడై నా సుతుఁడీ
నీచాధము వేఁడ, వీఁడు ♦ నిర్గుణుఁడై సం
కోచము లేకిటు సేసెను
బ్రాచితమే వలయుఁ బలుక ♦ వాసియుఁ బాసెన్. 115

హా, హా. మంత్రీ, పుత్రహీనతచే దుర్గతికిన్ గుఱియైతిని. అకటా.

క. గర్భమునఁ బుత్రుఁ డొకఁడా
విర్భూతుండయ్యె నాకు. ♦ వీతనయుండీ
నిర్భాగ్యుం డీజేఁడా
యర్భకునిన్ యువతిఁ జేసె ♦ నయ్యో మంత్రీ. 116

(అనుచు వడిగాఁ బోయి సామవతినిం దెచ్చి మ్రోల నిలిపి) కంటివే మతిగుప్తా ఈ దార్గత్యంబు నేనేమని వాకొందు.

చంద్రాం. (భయవిహ్వలత) (స్వగతము) ఎంతటి సంతాపంబు సంఘటించితినీ వృద్ధభూసురునకు! ఎంతటి దురితంబు లొనరించితి నా సీమంతినీ పతివ్రతాశిరోమణికి! హా హా.

క. ద్విజ లడుగ రాజు లిచ్చుట
నిజమగు ధర్మంబు దీని • నీటఁ గలిపి నేఁ
గుజనుల పోకడఁ బోయితి
వృజనవ్రజ మేచి యశము•వీటిం బుచ్చెన్. 117

(భూసురునిదిక్కుఁ గని) భూసురోత్తమా నేనపరాధిని. హంతవ్యుఁడను. శిక్షార్హుఁడను. దేవా, నీయనుగ్రహంబున నను హతమ్ముఁ జేసిన నాకదియ యనుగ్రహంబై యుండు. పంచమహాపాతకంబులకుం బలె నీ యఘవిమోచనంబునకుఁ బ్రాయశ్చిత్తంబు కలుగొందులేదు (అనుచుఁబాదంబులపైవ్రాలును)

హా. స్వ. (స్వగతము). హా. ఈ ధరావరుండు పశ్చాత్తాపతప్తుఁ డగుచున్నవాఁడు. నా గ్రహాచారమున కితఁ డేమి సేయును, ఊఱడించెద.

చ. నరవర లెమ్ములెమ్ము, వ్యస • నమ్మున నేమి ప్రయోజనమ్ము? మీఁ
దెరియక చేయు కర్మఫల • మూఁగునెయూఁపిన? వల్దటన్న? భూ
నరకృతపాతకమ్ములకు • బ్రాహ్మణుఁడే గద యాలవాల మీ
దురితము నాది, నిక్కమిది • దుఃఖము నీ కదియేల,వీడుమా.

ఆ సీమంతినీ సతి రెండవ శర్వాణియే యని యెఱుంగక యొనరించిన యపచారఫలంబిది.

క. పతిన్మాత్రిమె యా సతి
పాతివ్రత్య ప్రభావ • ఫల మిది! దీనిన్
మాతరమే వెడఁగ? నా
మాతా జగన్మాత గౌరి, మమత మఱచినన్. 119

చంద్రాం. ఈదురితమునకు విమోచనం బా పరమేశ్వరీ చరణారవిందార్చనం దక్క వేఱొక్క తెఱంగునం గాదు, కృతపడిన పనికిఁ గుతిలఁ బడ నేమి ప్రయోజనంబగు! నేనిప్పుడ తపోవనంబునకేగి హైమవతి నారాధింతును.

చంద్ర. గురువర్యా, భవద్వచనంబులు, నాకును బరమహితోపదేశమ్ములుగా నున్నయవి. పూజనీయులగు మిముఁ బోలు పురోహితులం బురస్కరించికొని యప్పరమేశ్వరి నారాధించి నా దురితంబుఁ దొలఁచికొనియెద. ప్రస్తుతమిద్దియ కర్తవ్యంబు. పాపభరంబున మ్రగ్గుచుండు శరీరంబుచే రాజ్యభారంబు సైరింపనోఁప, ఇచట నుండ నోఁప, గురువర్యా, అనుగ్రహించి లెండు పోవుదము.

సారస్వ. (ఆలోచన నభినయించి తలయూఁచి) చంద్రహాసా, నీయుద్యమంబు ప్రాజ్ఞజనైక సమ్మతముగా నున్నయది. మంచిది. ఇదియే శుభదినము. మనము వెళ్లుదము.

(నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము - వనము.

సారస్వతుఁడు, చంద్రహాసుఁడు, తపోవనంబుననుండు గౌరీమందిరంబునందుందురు సారస్వతుఁడు మానమూనితపంబొనరించుచుండును.



చంద్రహాసుఁడు.

సీ. సర్వసంక్షోభిణి ♦ సర్వవిద్రావిణి, సర్వస్వరూపిణి ♦ శర్వరాణి
సర్వవశంకరి ♦ సర్వప్రియంకరి, సర్వాంగసుందరి ♦ శంభునారి
సర్వసమ్మోహిని ♦ సర్వసంస్తంభిని. సర్వార్థదాయిని ♦ సర్వజనని
సర్వరహస్యార్థ♦సాధకయోగిని. సర్వమోదిని యఘు♦శమని జనని

తే. గీ. త్రిపురమాలిని త్రిపురశ్రీ ♦ త్రిపురమాత
త్రిపురసుందరి నిన్నునే ♦ దృఢము గాను
నమ్మి భజియింతు భక్తిని ♦ నతు లొనర్తు
నభయ దానం బొసంగవే ♦ యంబ వేగ. 120

తల్లీ, నినుఁ దప్ప వేఱు దైవంబు నేఁగానను.

సీ. పాశాంకుశాభయ ♦ వరదశయా, దయా
పాంగహర్షితవివి ♦ ధార్థినిచయ
వాణీరమాసేవ్య ♦ పార్శ్వద్వయా, ప్రియా

శయపోషితాశేష ♦ జననికాయ
బ్రిహ్మాది సకలామ ♦ రస్తుత పదపద్మ
పద్మాసనాసీన ♦ భక్తసులభ
ప్రాలేయశైల సం ♦ భవ భవదేహార్థ
ధారిణి సౌభాగ్య ♦ దాననిరత.

తే. గీ. శిఖిసుకేశావనాంచిత ♦ శివమహేశి
సర్వమంగళ శంకరి ♦ సంతరింపు
మమ్మ నీభక్తునిని నన్ను ♦ నతిశయకృప
నీవు నతులివె కావింతు ♦ లోకజనని. 121

(నతివృత్తము.)

శ్రీవరవాగీశనుతే ♦ శ్రీశివసహితే ♦ శ్రితదే గుణకలితే
సేవక లోకావన సౌ ♦ శీల్యసువసతే ♦ స్థిరభక్తి సుమహితే
భావుకదే దేహి శుభం ♦ భావజవినుతే ♦ భగవత్యయిలలితే
శ్రీవరదే దేవి మహా ♦ సేనజననితే ♦ శివదే నతిరయితే. 122

శా. అంబా: భూసురపుత్రు లర్భకులున ♦ న్నర్థార్థులై వేడఁ బా
పంబుం జెన్నక నేను హేళనమతిన్ ♦ వంచించి దాంపత్య భా
వంబు న్వారికిఁ గల్గ నందొకరికిన్ ♦ వాల్గంటి వేసంబు ర
మ్యంబౌ నట్టులఁ బన్న నద్దియె నిజం ♦ బయ్యె న్భవచ్ఛక్తిచేఁ.

అంబా. భక్తపరాధీనురాలవను నీబిరుదు త్వదీయ పాదాంబుజంబులే శరణంబని నమ్మిన సీమంతినీ సాధ్వీమణియందు సార్థకపఱిచితివి. జననీ, ఆసతి సీమంతినీప్రభావంబు నైరింపక భూసురసుతులకిర్వురకుఁ గృత్రిమదాంపత్యంబుఁ గల్పించి యాపతివ్రతామణిని వంచింపం దలంచితి. నీభక్తురాలి యమోఘమహిమచే ద్విజపుత్రుండు స్త్రీరత్నంబయ్యె, ఈవృద్ధబ్రాహ్మణు నకేక పుత్రవిషయంబుగావున గతిగానక వ్యథఁజెందెడు. ఇంతటిదురితంబునకుం గారణంబు నేన, జననీ; ఆస్త్రీని మరలఁ

బురుషునిగానొనర్చి యాపాతకంబునుండి నన్ను స్వేలువడఁ జేయుదువని నతు లొనరించి వేఁడెదను. కరుణింపవేతల్లి, (నతులొనర్చును)

(గర్భగృహమునందుండి పార్వతి ప్రత్యక్షమై).

పార్వతి. భక్తాగ్రేసరా, నీభక్తికిమెచ్చితి. త్రికరణశుద్ధిగ నెత్తఱి నేమఱక చిత్తమున నన్నుభజించుచుండునాభక్తురాలు నీమంతిని నాకంటెనధికురాలు. ఆపతివ్రతా మణివచనంబమోఘమ్ము. దానిమార్పనశక్యంబు. ఆసతీమణితలఁచినట్లు వారిరు వురుజాయాపతులై యుందురుగాత, ఆసారస్వతునకు లోకఖ్యాతింగను సుతుఁ డుద్భవిల్లు. అట్టిసుతునిచే సారస్వతుండుసద్గతినొందు. ఇద్దియనావరమ్ము, (అంతర్ధానమగును.)

సారస్వ. (హర్షంబునలేచు) చంద్రహాసా,జగదంబ వాక్యంబమోఘంబు.దీనికంటెహెచ్చు మనము బడయంజాలము. పుత్రుండుగదా సద్గతికి ముఖ్యము. అదిసిద్ధించెను. మనమిపుడు పురింజేరి వారిరువురకుఁ బరిణయమహోత్సవంబొనర్తము. లెమ్ము.

చంద్ర. గురువరా, మీయానతిశిరసావహించెద, మీసుతునకు రాజ్యార్హంబిచ్చెద, రండుపోదము.

(నిష్క్రమింతురు).

## తృతీయరంగము.

---

### ⟵⟵ వివాహమండపము. ⟶⟶

వధూవరులగు సుమేధుఁడు, సామవతి పెండ్లిపీటలపైఁ గూర్చుండియుందురు. భరద్వాజముని. వేదమిత్రుఁడు. సారస్వతుఁడు. విప్రులు, చంద్రహాసుఁడు, బ్రాహ్మణ సువాసినులు గూర్చుండి యుందురు.

పురోహితుఁడు మంత్రాక్షతలపళ్లెరముతీసికొని యందఱకు మంత్రాక్షతలిచ్చును. విప్రులాశీర్వదింప నారంభింతురు.

విప్రవరుఁడు,

ఉ. శ్రీ విలసిల్లఁ బేరెదను ♦ జెల్వుగ నీలగవాక్షులక్షితం
బా వరహేమపుత్రికగ ♦ స్వాశ్రితు లెంచఁగ సత్కటాక్షపీ
యూవిభవంబునం బరఁగి ♦ సర్వజగంబుల లీల నేలు న
ద్దేవుఁ డిడున్ జిరాయువును ♦ దృప్తిని శాశ్వత మంగళంబులన్.

మఱియొకద్విజుఁడు.

ఉ. ఏవరుఁ డాధరాధరుని ♦ యెమ్మెలపట్టి తపంబు మెచ్చుచున్
భావజవైరియన్ బిరుదు ♦ బాసి యనారత మాసతీరతిన్
భావితుఁడై కృపామతిని ♦ భామ కొసంగెను దేహభాగ మ
ద్దేవుఁ డిడున్ జిరాయువును♦దృప్తిని శాశ్వత మంగళంబులన్.

వేఱొకబ్రాహ్మణుఁడు.

ఉ. భావిత సర్వభాషలకుఁ ♦ బాలకురాలయి తత్స్వరూపయై
సేవకులౌ జనంబులను ♦ జెన్నుగఁ బెంచెడి తల్లియై మహిన్
దేవమనుష్యతాపసత ♦ తిస్తుత యౌ సతి వాణిఁ బ్రోచు న
ద్దేవుఁ డిడున్ జిరాయువును♦దృప్తిని శాశ్వత మంగళంబులన్. 126

భూసురుఁడు.

ఉ. ఏ వరదుం డినుండును స ♦ దీశుఁడు మంగళుఁడు న్బుధుండు గీ
ర్దేవుఁడు గావ్యవంద్యుఁడు సు ♦ ధీస్తుతసుస్థిరనామకుండు ఛా
యావినుతుం డుదారుఁడు స ♦ మంచిత భక్తశుభావహుండు న
ద్దేవుఁ డిడున్ జిరాయువును♦దృప్తిని శాశ్వత మంగళంబులన్. 127

దీక్షితుఁడు.

ఉ. దేవవిభుప్రీథుండు ద్విజ ♦ దేవుఁడు ధర్మవిభుండు కర్బురా
ఖ్యావిదితుండు జీవనపుఁ ♦ డాశుగుఁ డర్థదుఁ డీశుఁ డేడు ది
గ్దైవత మంచు స్తుత్యుఁడును ♦ దారుఁడు సత్పరివారుఁడౌను న
ద్దేవుఁ డిడున్ జిరాయువును♦దృప్తిని శాశ్వత మంగళంబులన్. 128

సోమయాజి.

ఉ. ఏ వరవంద్యుఁ డీశ్వరస ♦ మీహితజన్ముఁడు దానవీరుఁడుఁ
శ్రీవరరూపుఁడౌ మునివ ♦ రిష్ఠుఁడు వానర రూపభీముఁడున్

సేవితరాముఁడున్ గృపుఁడు♦శ్రీకరశైవమహామహుండు న
ద్దేవుఁ డిడున్ జిరాయువును♦దృప్తిని శాశ్వత మంగళంబులన్.129

పౌరోహితుఁడు.

ఉ. దైవతకోటినిం గనిన ♦ తండ్రి త్రిమూర్తులఁ గన్నమేటి నీ
తావిభు విందుఁ జేసిన యు ♦ దారుఁడు శ్రీరఘురాము నొజ్జయున్
దేవపతిప్రశాసకుఁడు ♦ దీప్తచరిత్రుఁడ రుంధతీశుఁ డ
ద్దేవుఁ డిడున్ జిరాయువును♦దృప్తిని శాశ్వత మంగళంబులన్.130

ఉ. సేవక లోకపాలన వి ♦ శేషమతిన్ ఝష కూర్మ పోత్రి రూ
పావహుఁడై నృసింహుఁడుగ♦నై వడుఁగయ్యుఁద్రిరామరూపుఁడై
పావనబుద్ధమూర్తి గను ♦ భాసిలి కల్కిగనై వెలుంగు న
ద్దేవుఁ డిడున్ జిరాయువును♦దృప్తిని శాశ్వతమంగళంబులన్.131

(పురోహితుఁడు లేచి).

పురోహి. ఏమండి సారస్వతులు; మగవారి పని ముగిసినవి. శేషమంతయు నాడంగుల పనియ (అనుచు ముత్తైదువుల దిక్కుఁ జూచి) ఏమమ్మా శేషమ్మగారు! వచ్చి హారతి యెత్తుదురా!

శేషమ్మ. మంచిదండి (అనుచు మఱియొక ముత్తైదువునుం జూచి) ఏమే నీవు పోయి హారతి యెత్తుము.

కొండమ్మ. నేఁబోవుటదేమి! నీవును నీబిడ్డ యున్నారు గదా, హారతి యెత్తుటకు మీరిరువురు చాలరా!

శేషమ్మ. కోపమేల? నీవు చక్కఁగాఁ బాడుదువని చెప్పితిని. వలదన్న వదలుము. మేమే యెత్తెదము. (బిడ్డనుంజూచి) ఏమే, సరసు! లెమ్ము, అందఱు తప్పించుకొనియెదరు మన కెటు తప్పును. ఆరతి పళ్లెరము సిద్ధము సేయుము.

సరసమ్మ. సిద్ధముగ నున్నయది లెమ్ము.

(హారతి పళ్లెమెత్తికొని వధూవరుల యెదుట నిలుతురు)

శేషమ్మ. నరసు! పాట పాడుము.

నరసమ్మ. పోవే, నాకు సిగ్గుగా నున్నది. నీవేపాడుము.

శేషమ్మ. సిగ్గేమిసిగ్గే! క్రొత్తవారెవరున్నారు? అందఱు మనవారేకదా!

నరసు. ఏపాటఁ బాడుదునే?

శేషమ్మ. మంగళావహమయిన పద్యములు చెప్పుము.

నరసు. మంగళారతిఁ బద్యమునఁ జెప్పుదురేమే?

శేషమ్మ. ఇప్పుడదియ యాచారము. మంత్రములు వదలి మగవారు పద్యములు చెప్పి యాశీర్వదింపలేదా?

నరసమ్మ. నిజము, అటులయినఁబాడెద.

పాలాశదళ వృత్తము.

సరసరసభరితముగ ♦ సరసిజముఖుల్ మే ।
లరయుచును గరివరదు ♦ నధికముగఁ బాడన్ ।
దురితహరుఁ డమరవర ♦ దుఁడు మనము మెచ్చన్ ।
పరమశుభ మిరువురకుఁ ♦ బదిలముగ నిచ్చున్ ॥ 132

మంగళమహాశ్రీవృత్తము.

శ్రీవిభవయుక్తుఁడయి ♦ చిత్తభవరక్తుఁడయి ♦ సిద్ధజనముక్తికినిజోడై ।
దేవగణసక్తుఁడయి ♦ దీనగుణరిక్తుఁడయి ♦ తేజరిలుమాధవుఁడుమీకున్ ।
పావనపుజీవనము ♦ పాయనియశోధనము ♦ ప్రాభవమునిచ్చెడునటంచున్ ।
భావమునఁగోరుచును ♦ భామినులుభక్తిమెయిఁ ♦ బాడెదముమంగళమహాశ్రీ ॥

(పళ్లెరమునందు వధూవరులు వరహాలువేయఁగా ముత్తైదువులు నివ్వాళిమింతురు.)

భరద్వాజుఁడు. (లేచి) సుమేధా. ఈసభ్యాళి యాశీర్వాదఫలంబు మీకపరిమితశ్రేయఃప్రదంబు. ఇంతకంటెనధికంబు నీవుగోరునదియేమున్నది? ముదంబునన్ మనుము.

సుమేధుఁడు. గురువర్యా. గురుతరాఘంబు మానసభూమి నూషరంబుఁజేయ సంతోషబీజం బందు నాటుటెటుల!

నిదానవృత్తము. నివేదింతుఁదాపసవర ♦ నిక్కమక్కటా।
యవాప్తాఘరోగభరితుఁ ♦ డై తి దానినిన్।
నివారించునౌషధమును ♦ నేనుగాన నా।
భవానీశపాదకమల ♦ భక్తిఁదప్పగన్॥ 134

తపోధనా. ఆపతివ్రతాశిరోమణికి సీమంతినీసతికి నేనొర్చిన యపచారం బవాచ్యంబు.

కం. ఈజనపాలుని పాపం।
బౌజగదంబార్చనమున ♦ నపహృతమయ్యెన్।
నేఁజేసినపాతక మే।
యేజన్మమునందు నన్ను ♦ నేఁచునొ తిరమై?॥ 135

ఋషిశ్రేష్ఠా. మత్కృతాఘవిమోచనం బా యపర్ణామృత్యుంజయుల పదకమల సేవనంబునఁదక్క వేఱొక్కటిం గానను. వారినిదర్శించు మార్గంబెద్ది?

భరద్వాజుఁడు. సుమేధా: నీవిటు చింతింపవలదు. నీపాపంబుఁబాపు నుపాయంబొక్కటి యున్నది. అదిసులభసాధ్యంబు.

మ. సతిసీమంతిని శాంకరీసతికిన్ ♦ సామ్యంబగున్ గాన దు।
ష్కృతములార్చియును నిత్యమాసతిని భ♦క్తిన్ మానసంబందును।
స్థితఁగాఁజేసి భజింపుమా తలఁపుమా ♦ శ్రేయంబగున్‌నీకు సం।
తతసౌభాగ్యములబ్బు నీదయితకున్ ♦ సాంద్రంబుగా నీభువిన్॥

సుమేధా: ఆ సతీస్మరణయే నీదురితమునకు నివారణంబగు. మఱేదియున్నలదు,

సుమేధుఁడు. మునికులోత్తమా: తమ హితబోధనమ్ము నామదికి నహాసమ్మతమ్ము. సాక్షాదపర్ణావతారంబున ధారుణినున్న సీమంతినీసతీశిరోమణిని దర్శింపకున్న నాజన్మసార్థకమగు టెటుల?

---

* నూతనవృత్తము. చతుర్దశచ్ఛందంబగు శక్వరియందు 5610వ వృత్తము. గణములు య. జ. న. ర. వగణములు, 10వ యక్షరముయతి, దీనినిఁ బాటగా హిందూస్థానీరాగము రూపకతాళములోఁ బాడనగును,

ఉ. ఆ నిషధేశుదార జగ ♦ దంబను భక్తినిఁ బూజసల్పి తా।
మానవదుర్లభంబయిన ♦ మాన్యతఁగాంచె సువాసినీత్వమున్।
న్యూనతలేకయుండె యశ ♦ ముర్విని నిల్పెను శాశ్వతంబుగాఁ।
గాన వసుంధరాంబికగఁ ♦ గ్రాలెడు సాధ్విని గాంచివచ్చెదన్॥137

వేదమిత్రుఁడు. పుత్రా! నీయుద్యమంబు స్తుతిపాత్రంబు. అవశ్యాచరణీయంబు. వధూవరులిరువురుం జని యాసాధ్వీలలామను గాంచి మాయపరాధంబు సైఁపుమని వేఁడికొనిరండు. మీదుష్కృతమునకిదియె నిష్కృతి.

చంద్రహాసుఁడు. (లేచి) సభ్యులారా మత్కృతాఘశాంతికై యా త్రిలోకమాతను గుఱించి తపంబొనర్ప శాంకరి ప్రసన్నురాలై తనభక్తురాలు సీమంతిని తనకంటె నత్యధికురాలని యానతిచ్చెను. నిజంబద్దియే యని నామనోనిశ్చయము. కావున మనరాష్ట్రమునందలి సకలకులకులాంగనలెల్లరు సోమవారవ్రతంబాచరించి సీమంతినీసతియుంబలె సమస్తసౌభాగ్యంబు లందనలయును, మఱియును మన దేశమునందుండునశేషజనులును మఱిముఖ్యంబుగం బరిణయానంతరంబున వధూవరులును సీమంతినీ సందర్శనంబుఁ జేయవలయును. ఇదియే శాస్త్రవిధిగా నెంచి యాచరింపవలయును. (మంత్రిదిక్కుంజూచి) మతిగుప్తా. సీమంతినీప్రభావంబు మన రాష్ట్రమునందెల్లెడఁ బ్రకటింపంజేసి నాయాజ్ఞ నెఱవేర్పుము. (సామవతీసుమేధులంజూచి). జననీజనకులారా. మీకోరికఁదీర్ప మీసేవకుఁడుగా వెంబడించి యాసాధ్వీమణిని సందర్శించి వచ్చెదను. రండి పోదము. (మంత్రిదిక్కుంజూచి) మతిగుప్తా నేనిషధనుండి మరలివచ్చునంతవఱకు రాజ్యంబు నామాఱుగా నీవ పరిపాలించుచుండుము.

మతిగుప్తు. చిత్తము. తమయాజ్ఞ నిప్పుడే దేశమందంతట వెల్లడింపంజేసెద.

(అనుచు నిష్క్రమింతురు.)



## చతుర్థరంగము.

మతిగుప్తుఁడు. రాజపురోహితులగు వ్యాసశాస్త్రి. సభ్యులు.



మతిగుప్తుఁడు. శాస్త్రులవారూ. సీమంతినీప్రభావంబుఁ బ్రకటించుటకై యొక చిన్నద్విపద వ్రాయుఁడని వేఁడికొనియుంటినే, వ్రాసితెచ్చితిరా ?

శాస్త్రి. తెచ్చితిని. సిద్ధముగానున్నయది చూడుఁడీ! (అనుచునొక కాగితమిచ్చును.)

మతిగుప్తుఁడు. (ద్విపను జదివికొని). శాస్త్రులవారూ. ఇంతయ చాలును. జనులెల్లరకుం దెలియులాగుననున్నయది. దీనినిం బ్రకటింప నితరులకిచ్చుట నాకు నిష్టంబు గాదు. దయచేసి యీపతివ్రతాశిరోమణీచరితముఁ దమరే ప్రకటనసేయవలయునని నాకోరిక. క్షమింపవేఁడెద.

శాస్త్రి. మతిగుప్తా. ఇంతకంటెను హెచ్చగు పుణ్యకార్యంబేమియున్నది ! నేనే యీపనినెఱవేర్చెద. ఇప్పుడే యీసభ్యాళియెదుటఁ బ్రకటనపత్రికఁ జదివెదను. ఆపత్రికనిటుతెమ్ము. (అనుచుఁబత్రిక నందికొని.)

## ద్విపద.

వసుధేశుఁడగుచిత్ర ♦ వర్మునిపుత్రి
కుసుమకోమలగాత్రి ♦ కొమరొప్పుచుండ 2
అధికవిద్యావంతుఁ ♦ డగుద్విజుఁడొకఁడు
విధవాత్వసంప్రాప్తి ♦ వెలఁదికటంచుఁ 4
బలికినపలుకులు ♦ బాలపాటించి
అలుఁగులపడిప్రాక్కృ ♦ తాఘంబునెన్ని 6
శివశివాసేవన ♦ శీలంబుఁబూని
అపగీర్ణమతివారి ♦ నర్చించుచుండె

అటుగొన్ని దినములు ♦ నరిగినపిదపఁ
గుటిలాలకవరించెఁ ♦ గువలయమిత్రు
నింద్రసేనునిపుత్రు ♦ నీడ్యచరిత్రు
చంద్రాంగదుండను ♦ చక్కనివరుని
పరమోత్సవంబునఁ ♦ బరిణయంబయ్యె
తరుణి సుఖమ్ములు ♦ దైవారఁగనియె
ఇటుమూఁడుదినములు ♦ నేగినపిదప
కుటిలదుష్టగ్రహ ♦ కూటఫలంబు
పరిణమించెనొనాఁగఁ ♦ బతినీటమునిఁగె
పరిమితిమీఱంగఁ ♦ బడఁతిదుఃఖించి
భోగంబులన్నియుఁ ♦ బోకార్చిస్రుక్కి
యోగినియుంబోలె ♦ యువతికాంతార
భాగంబునందుండు ♦ పార్వతీశ్వరుల
సాగమోక్తవిధాన ♦ మగుభక్తియుక్తి
నారాధనాధీన ♦ యయిమించిసోమ
వారవ్రతంబెడఁ ♦ బాయకభక్తి
నాచరించుచునుండె ♦ ననవరతంబు
ఈచానచరితకు ♦ నీశానిమెచ్చి
పతిప్రాణమునుఁగాచి ♦ పడఁతికినిచ్చె
సతిమహిమనుఁజూచి ♦ సైఁపకచంద్ర
హాసుఁడామెనుబరి ♦ హాసంబుసేయ
నీసడమునునించు ♦ కేనినెన్నకమె
పనిపూనిమాయచే ♦ బ్రాహ్మణసుతుల
ఘనులనర్థులమహా ♦ గౌరవయుతుల

దంపతులుగఁజేసి ♦ తగవటి వారి
సంపఁగా వారుజా ♦ యాపతులటుల
పోయి యర్థమువేఁడఁ ♦ బుణ్యచరిత్ర
యీయుక్కివంబును ♦ నెటేఁగియు వారి
నాయుమామృడులుగా ♦ నాత్మలోఁదలఁచి
వాయినమందించి ♦ వందనంబిడిన
యంతనెనిజమగు ♦ నతివవైనసాను
వంతుఁడుమాఱెఁద ♦ ద్వనితా ప్రభావ
మేమనికొనియాడ ♦ నేరికిఁదరము
హైమవతీసతి - యాభక్తురాలు
తనకన్నహెచ్చని ♦ తప్పకపలికె
నని మనరాజిపు ♦ డనియెనుగాన
మానినులారసీ ♦ మంతినీమహిమ
వీనులచవిదీఱ ♦ వినుఁడియెల్లపుడు
సోమవారవ్రత ♦ సుస్థిరఫలము
నీమానినీమణి ♦ యిమ్ముగానొంది
వాసిగానఖిలను ♦ వాసినీత్వంబు
భాసిల్లఁగాంచెను ♦ బార్వతీమహిమ
కావున,మీరును ♦ గల్యాణులార
యేవేళనెచటగి ♦ రీశులఁదలఁచి
సోమవారంబును ♦ శుభదినమందు
ఆమోదముగను గా ♦ త్యాయినీవ్రతము
నేమముదప్పక ♦ నిశ్చలభక్తి
నోముచుఁగనుఁడిమ ♦ నోరథంబెల్ల

దైవారఁబతిభక్తి ♦ దైవభక్తియును
నేవేళనేమఱ ♦ కెందునుగలిగి 5
మనుఁడిమానితముగ ♦ మానినులార
గనుఁడెల్లసుఖములు ♦ గళ్యాణులార 6
ధరవధూవరు లరుం ♦ ధతిఁజూచురీతి
పరిణయమైనట్టి ♦ ప్రజలెల్లరిఁకను 6
గనుఁడిసీమంతినీ ♦ ఘననాటకమును
వినుఁడియాసాధ్విను ♦ విశ్రుతచరిత 6
ఇహపరసుఖములు ♦ నిచ్చునునిజము
గ్రహదుష్ఫలంబులు ♦ గల్లలైపోవు 6
పురజనులార, యో ♦ పుణ్యాత్ములార
ధరణీశునానతిఁ ♦ దగఁజేయుఁడీరు. 6

(నిష్క్రమింతురు)

॥ శ్రీ ॥



PRINTED AT THE ANANDA PRESS, MADRAS.